శ్రీ మద్భగవద్గీత
(పంచమ ముద్రణము)
వ్యాఖ్యాత: శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు
వెల రు. 4-0-0. పోస్టేజి రు. 0-9-0.
ఆంధ్రగ్రంథమాల, 6,7, తంబుశెట్టివీధి, మద్రాస్.

# ఆంధ్రపత్రిక

తెలుగు మెఱుగులు
(రెండవ కూర్పు)
శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి
వెల రు. 2/- పోస్టేజి 0 7 0
ఆంధ్రగ్రంథమాల, 6,7, తంబుశెట్టివీధి, మద్రాస్.

The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 210 THURSDAY 3rd NOVEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao

# "మానవదృక్పథం లోపించడవే నేటి ప్రపంచసమస్యలకు కారణం"

## "సైనికబలం ద్వారా ఫ్రాన్సు ఇండో చైనాను ఆక్రమించడం అసంభవం"

### బ్రిటిష్ విదేశాంగశాఖకు భారతప్రభుత్వ విపులనివేదిక

లండన్, నవంబరు 1: ఇండో - చైనా పరిస్థితినిగూర్చి భారత ప్రభుత్వం బ్రిటిష్ ప్రభుత్వానికి ఒక మెమొరాండం అందజేసింది.

ఈ మెమొరాండం ఎర్నెస్టు బెవిన్‌కు అందినట్లు నేడు ధ్రువపరచారు. కాని దాన్ని రహస్యంగా వుంచారు.

సైగాన్‌లో వున్న ఇండియా కౌన్సల్ భారతప్రభుత్వం పనుపున దీన్ని తయారుచేశారు. భారతప్రభుత్వం దాన్ని బ్రిటిష్ ప్రభుత్వానికి అందజేసింది.

బ్రిటిష్ విదేశాంగ కార్యాలయానికి సంబంధించిన వాళ్ళెవ్వరూ అందు ఏమి ఉన్నదీ బయట పెట్టనూ లేదు, దాన్ని విమర్శించనూ లేదు.

కాని కొంతమంది నమ్మకస్తులద్వారా ఇందులో ఏమి వున్నదీ కొంతవరకు బయటకు పొక్కింది.

ఇండో-చైనాలో ఎంతమిలిటరీ బలాన్ని ఉపయోగించినా జయంపొందటం వారికి అసాధ్యమైన విషయమని ఈ మెమొరాండం స్పష్టంగా పేర్కొన్నది.

ఒకవేళ ఫ్రెంచివారు ఇండోచైనాను తమ అధీనంలోకి తెచ్చుకోవాలని ప్రయత్నం చేస్తూ, అందుకు 50 వేలమంది సైనికులను వినియోగించినా, అచ్చట యుద్ధం కొన్ని దశాబ్దాలు పనుతుందని గూడా ఈ మెమొరాండం స్పష్టంచేసింది.

అసలు ఫ్రాన్సుకు ఇండో చైనాలో రాజకీయంగాగాని, ఆర్థికంగాగాని, సైనికంగా గాని ఏమీ తావులేదు. అది అక్కడ పూర్తిగా విజితమైపోయింది.

## మలయాలో 870 మంది విప్లవకారుల వధ

సింగపూర్, అక్టోబర్ 31: గత సంవత్సరం జూనులో అపాత్కర పరిస్థితి ప్రకటింపబడినది లగాయతు, ఇప్పటివరకూ మలయాలో 870 మంది విప్లవకారులు నిహతులైనట్లు, ... మలయా ప్రభుత్వ ... పత్రికా విలేఖరులసమావేశంలో ప్రకటించారు. ...

8 మంది ... మరొకముఠా 15 రోజులుగా రాయల్ విమానాలు జరుపుతున్న దాడికి తట్టుకోలేక లొంగిపోయినట్లు నేడు మలయా పోలీసు అధికారులు ప్రకటించారు. మరొకముఠా తాలూకు యిద్దరుగూడ లొంగిపోయారు. ఈ పదిమందిలో 7 గురు తమిళులు.

## గ్రీక్ సమస్యపట్ల సమితి వైఖరి

### రాజకీయ సంఘంలో పోలెండ్ విమర్శ

లేక్ సక్సెస్, నవంబరు 1: గ్రీక్ సమస్యను పరిష్కరించటానికి ఐక్యరాజ్య సమితి రాజకీయ సంఘం అత్యధిక సంఖ్యాకులు నిజమైన ప్రయత్నమే చేయలేదు. ఐక్యరాజ్య సమితి, భద్రతా మండలి, బాల్కన్ సంఘం ఇవన్నీ అమెరికాకు దోసి లొగ్గి, యూరప్‌లో అమెరికన్ ఆక్రమణకు తోడ్పడే బాణప్రమెంవనగా గ్రీసు, టర్కీ లను మార్చాలన్న ... అని పోలెండ్ ప్రతినిధి కాట్స్ జాకీ విమర్శించాడు.

... ప్రయత్నిస్తున్నది. గ్రీసుకు నిజమైన ప్రమాదం అమెరికా విధానమే" అని కాట్స్ జాకీ ఆరోపించాడు.

## శాన్ ఫ్రాన్సిస్కో వాణిజ్య మండలి విందులో నెహ్రూ హెచ్చరిక

### ఆసియాసమస్యలను స్నేహవాత్సల్య దృష్టితో పరిశీలించవలసిందని విజ్ఞప్తి

శాన్ ఫ్రాన్సిస్కో, నవంబరు 1: "అంతర్జాతీయ సమస్యలను పరిష్కరించటానికి, ముఖ్యంగా ఆసియా సమస్యలను గురించి ఆలోచించేటప్పుడు సస్నేహ వాత్సల్యదృష్టితో ఆలోచించాలి. నేటి ప్రపంచ సమస్యలకన్నిటికి రాజకీయాలలో మానవత్వదృష్టి నశించడమే కారణం." అని ప్రధాని నెహ్రూ ఈవేళ శాన్ ఫ్రాన్సిస్కో వాణిజ్యమండలివారు తన గౌరవార్థం యేర్పాటుచేసిన విందు సందర్భంలో ప్రసంగించారు.

...

'నేను మీ దేశంవచ్చాక—నన్ను మీరెంతో ఆప్యాయంగా ఆహ్వానించారు. ఈ స్నేహవాత్సల్యాలతో అమెరికా అంటే యేమిటో నేను ఉజ్వలంగా అర్థంచేసుకొనటానికి సావకాశం కలిగింది. లోగడ నా అంతఃకరణలో అమెరికా అంటే ఇంత విస్పష్టాభిప్రాయం వుండటానికి సావకాశమేది?' అన్నారు.

నెహ్రూ అమెరికాలో చేసిన ప్రసంగాలన్నిటిలోకం టే ఈ సద్యః ప్రసంగంలో యెక్కువ ఉత్సాహావేశాలను ప్రదర్శించారు. ప్రసంగంవిని సభ్యులంతా చాల సంతసాన్ని వెలిబుచ్చారు. అది చూచి నెహ్రూ:

'అమెరికా ప్రజలు నాపట్ల చూపిన సౌహార్దయం చూస్తే, ఇలాంటిది ఎవ్వరినైనా వివశపరచేదిగా వున్నది. నేను మరి అల్పసంతోషిని. కాని ప్రజాహృదయాలను చూరగొనటానికి నాదగ్గరకూడా కొన్ని చతురతలున్నయ్. భారత సంస్కృతి నాకు అలాంటి శిక్షణనిచ్చి పెంచింది' అన్నారు.

'ప్రపంచ రాజకీయాలలో మానవౌదార్యత నశించుటయొక్కటే ఈనాటి బాధలన్నిటికీ కారణం. రాజకీయవాదులు వాస్తవిక దృక్పథంలేకుండా ఊహా నిర్మితమైన విభ్రాంతిమాన్య వాతావరణంలో ప్రవర్తించుచున్నారు. ఈ రాజకీయ వేత్తలకు ప్రపంచ ప్రజానీకంలో సాన్నిహిత్యం లేకుండా వున్నది. ...

## యూరప్ ఆర్థిక ఏకీకరణంలో బ్రిటన్ చేరదు

### స్టెర్లింగ్‌ప్రాంత నియమాలను అతిక్రమించేది లేదని క్రిప్స్ స్పష్టీకరణ

పారిస్, నవంబరు 1—"కామన్వెల్తుతోనూ, స్టెర్లింగ్ ప్రాంతంతోనూ ఉన్న ఆర్థికసంబంధాలకు విరుద్ధంగా ఉంటే ఏవిధమైన యూరపియన్ ఆర్థిక సమీకరణలోనూ బ్రిటన్ చేరదు. అయితే తాను చేరనప్పటికి మిగిలిన యూరప్ దేశాలు ఆర్థికంగా సహకరించ నిశ్చయించుకుంటే బ్రిటన్ దానికి సర్వవిధాలా తోడ్పడుతుంది." అని బ్రిటిష్ ఖజానామంత్రి సర్ స్టాఫర్డ్ క్రిప్స్ నేడు యూరప్‌లో మార్షల్ సహాయం పొందుతున్న 18 దేశాల ఆర్థిక మంత్రుల సమావేశంలో వెల్లడించాడు.

### ఇంకా విజయవాడవరకే రైళ్లు

చెన్నపట్నం, నవంబరు 2: విజయవాడ వాల్తేరులమధ్య రైలుమార్గంయింకా బాగు కానున్నందున విజయవాడ మదరాసు మధ్యమాత్రమే రైళ్లు వస్తున్నవి. గ్రాండుట్రంక్ ఎక్స్‌ప్రెస్ మామూలు రస్తాలో పోవుచున్నది. ఈ సాయంత్రం రావలసియున్న గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్ 40 నిమిషములు ఆలస్యముగా వచ్చునని తెలుస్తున్నది.

# ఆసియాలో సుస్థిరశాంతి

## ప్రాచ్యఖండ ప్రజలందరూ స్వతంత్రులైనప్పుడే సాధ్యమని సమితి అధ్యక్షుడు జనరల్ రోములో హెచ్చరిక

న్యూయార్కు, నవంబర్ 2: "ఆసియాఖండంలోని ప్రజలందరికీ స్వాతంత్ర్యం లభించి వారి జీవిత పరిస్థితులు అభివృద్ధి చెందేవరకూ, ప్రపంచదేశాలన్నిటిచేతనూ అమలుజరిపించటం సాధ్యమయే అంతర్జాతీయ న్యాయ నియమం ఏర్పడేవరకూ ఆసియాకు స్థిరమైన శాంతి లభించదు." అని ఐక్యరాజ్యసమితి అధ్యక్షుడు జనరల్ రోములో నేడిక్కడ హెచ్చరించాడు.

అమెరికా విదేశ వాణిజ్యమండలి తన గౌరవార్థం చేసిన విందులో ప్రసంగిస్తూ ఆసియాలో శాంతి నిలవటానికి ఈ మూడు అంశాలు నెరవేరాలని రోములో స్పష్టపరిచాడు.

(1) ఆసియాలోని అన్ని జాతుల ప్రజలకూ స్వాతంత్ర్యం రావాలి. స్వపరిపాలనకూ, స్వాతంత్ర్యంకోసమూ ఆసియాలో బయలుదేరిన ఉద్యమం మహాప్రచండంగా నడుస్తున్నది. ప్రపంచశాంతి భగ్నం కాకుండా దీనిని ఎవరూ నిలుపరించలేరు.

(2) ఆసియా ప్రజలకు లభించిన రాజకీయ స్వాతంత్ర్యం నిజమైనదని వారికి తోచటానికిగాను వారి జీవిత పరిస్థితులు అభివృద్ధిచెందాలి. ఆసియా దారిద్ర్యంలో మునిగి వుంటే మిగిలిన ప్రపంచం ...

## 54 మంది దుర్మరణం

### అమెరికాలో దారుణ విమాన ప్రమాదం

వాషింగ్టన్, నవంబరు 1: నేషనల్ విమానాశ్రయం సమీపంగా, బొలీవియన్ యుద్ధ విమానము, అమెరికన్ స్కైమాస్టర్ విమానము ఆకాశమధ్యంలో ఢీకొట్టుకొన్న కారణంగా 54 మంది మరణించినట్లు తెలుస్తున్నది. విమానాలు ముక్కలుముక్కలై పోయినవి. స్కైమాస్టర్ విమానంలో 53 గురు ప్రయాణీకులు, వైమానికులు ఉన్నారు. విమానాలు ముక్కలై పోయినరెండు గంటల తరువాత ఆ ప్రదేశాన్ని పరిశోధించగా ఒకడు కొనఊపిరితో ఉన్నట్లు, అతను బొలీవియన్ వైమానికుడైనట్లు తెలియవచ్చింది.

# "ప్రజలు వాస్తవికదృష్టిని అలవరుచుకోవాలి"

## వివిధ సమస్యలకు పరిష్కారమార్గం: పటేల్ ఉద్బోధ: జన్మదిన సందేశాలకు సమాధానం

న్యూఢిల్లీ, నవంబరు 1: "దేశం బహుసమస్యలను ఎదుర్కొంటున్నది. వాటిని పరిష్కరించడంలో ప్రజలందరు వాస్తవిక దృష్టిని ప్రదర్శించాలి. బాధ్యతతో తమ విద్యుక్తధర్మాన్ని నెరవేర్చాలి." అని తన 74 వ జన్మదినోత్సవావసరంలో వచ్చిన సందేశాలకు ప్రత్యుత్తరంగా ఇచ్చిన సమాధానంలో ఒక విజ్ఞప్తి చేసారు.

ప్రజలంతా ఈ విధంగా గనక ప్రవర్తించినట్లయితే, ప్రస్తుతం కనపడుతున్న గడ్డుసమస్యల నన్నింటిని అల్పకాలంలోనే పరిష్కరించడం సాధ్యమౌతుందనికూడా ఆయన ఈసందర్భంలో విన్నవించారు.

ఈ విధంగా ప్రవర్తించక, ఈ పద్ధతి ...

... రాగం తీవ్రంగా వ్యక్తమౌతున్నాయి. నేను వారందరికి కృతజ్ఞతాభి వందనము లర్పిస్తున్నాను.

పూర్వం నేను ఎంతముందుపడితే అంత మందినికలుసుకొని వారితో సన్నిహిత సంబంధాలను ...

(3 వ పేజీ చూడుడు)

## క్వాంటంగ్‌పై ఇండో-చైనా కమ్యూనిస్టు గెరిల్లాల దండయాత్ర

### చైనా జాతీయవార్తా సంస్థ ప్రకటన

హాంకాంగ్, నవంబరు 1: ఇండో చైనానుంచి వచ్చిన కమ్యూనిస్టు గెరిల్లాలు దక్షిణ చైనాలోని క్వాంటంగ్, క్వాంగ్సీ రాష్ట్రాలమీద దండయాత్రలు చేస్తున్నట్లు చైనా నేషనలిస్టు వార్తాసంస్థ వెల్లడిచేసింది.

ఇటువంటి దాడులవల్ల అంతర్జాతీయమైన ఇబ్బందులు వాటిల్లగలవు గనుక, ఇండోచైనాలోని ఫ్రెంచి అధికారులతో ఈ విషయమై చైనా జాతీయ ప్రభుత్వం చర్చించ దలచుకున్నదని గూడా ఈ ...

... నియాటుంగ్‌లో హూన్య నగరాలమీద పడ్డట్లుగూడా తెలుస్తున్నది.

ఇంతేగాక మరో 3 రెజిమెంట్ల వీట్నాం దళాలు లంగ్‌ప్టిన్ ప్రభృతి సరిహద్దు పట్టణాలపై దాడులు జరుపుతున్నట్లు గూడా తెలుస్తున్నది.

ఇండోచైనా సరిహద్దులను దాటి మరో 400 మంది గెరిల్లాలు క్వాంటంగ్ రాష్ట్రం మీదపడి ఖింగ్‌షీన్ జిల్లాలో మూడు పట్టణాలను పట్టుకొన్నారు.

...

## తుపాను వార్తలు, చిత్రాలు - 3 వ పేజీలో

(2 వ పేజీ చూడుడు)
(4 వ పేజీ చూడుడు)
(6 వ పేజీ చూడుడు)

# ప్రపంచ ప్రజాస్వామ్యానికి వయోజనవిద్య అత్యవసరం

## ఐక్యరాజ్యసమితి వయోజన విద్యా సమావేశంలో ఆజాద్ ఉద్ఘాటన

మైసూరు, నవంబరు 2: ఈ వేళ భారత విద్యామంత్రి మౌలానా అబుల్ కలామ్ అజాద్ ఐక్యరాజ్యసమితి విద్యావైజ్ఞానిక సంస్కృతి సంఘానికి సంబంధించిన గ్రామీణ, వయోజన విద్యాసంఘానికి ప్రారంభోత్సవం చేస్తూ భారత ప్రభుత్వం వయోజన విద్యకు ప్రథమ ప్రాముఖ్యం ఇవ్వబోతున్నదని అన్నారు.

ఐక్యరాజ్యసమితికిసంబంధించిన వయోజన సమావేశాలు మాట్లాడుతూ మౌలానా అబుల్ కలాం అజాద్ ఇంకా ఇలాగ చెప్పారు.

"ఏ దేశమైన సంపదలతో తులతూగుతూ అభివృద్ధి చెందాలంటే ఆ విషయం ఆ దేశప్రజల పురోభివృద్ధి మీద ఆధారపడు తుంది. ఈ పురోభివృద్ధి ప్రజలకు గల విద్యావకాశాలవల్ల ఏర్పడుతుంది. విద్య వల్ల ప్రజల స్వభావము, భావాలు సరియైన పంథాలో మలచటానికి వీలవుతుంది. పిల్లలవిద్యకంటె వయోజన విద్యకు ఎక్కువ ప్రాముఖ్యం ఉన్నది. ఏ ఆధునిక ప్రజాస్వామ్యమైనా అభివృద్ధి చెందాలంటే ఇది చాలా అవసరము.

మౌలానా అజాద్ ఇంకామాట్లాడుతూ ప్రస్తుతం భారతదేశంలో 20 లక్షల ఉపాధ్యాయులం కావలసి ఉన్నారనీ, అందుచేత నిర్బంధంగా కొందరిని ఉపాధ్యాయులుగా తయారుచేసే పద్ధతి భారత ప్రభుత్వం ఆలోచిస్తున్నదనీ అన్నారు.

మౌలానాఅజాద్ ఇంకా ఈ విధంగా ఉపన్యసించారు. "ప్రపంచం అంతా ఇప్పుడు ప్రజాస్వామ్య యుగంలో ప్రవేశించింది. ఆసియాఅంతటా ప్రజాస్వామ్యతరంగాలు వెల్లువలై ప్రవహిస్తున్నవి. అందుచేత ఆసియా దేశాలు ఈ దృక్పథంతో తమతమ విధానాలు ఏర్పరుచుకొని, తమ విద్యాప్రచారం ఈ విధానాలకు అనుకూలంగా మార్చుకోవలసి ఉన్నది. ముందు ముందు తరాలవారు ప్రజాస్వామ్యదర్శాలతో మెలగాలంటే, ఇప్పటి తరంలోని వారందరికీ మనం తగినట్టు విద్యావకాశాలు కల్పించాలి. అదీగాక నేటి కాలంలో ప్రజాస్వామ్యం సరియైన పంథాలో నడవాలంటే ప్రజాసామాన్యంలో సముచిత విద్యాప్రచారం జరిగితీరాలి. ఇది చాలా అవసరం."

వివిధ దేశాలలో విద్యాసమస్య పరిష్కరించిన విషయాన్ని గురించి మాట్లాడుతూ అజాద్ ఇంకా ఇలాగ అన్నారు. "జపాను ఈ విషయంలో బాగా పని చేసింది. ఆ దేశంలో నూటికి 95 గురు చదువను వ్రాయను నేర్చినవారు. టర్కీలో నూటికి 60 మంది అక్షరాస్యులుగా ఉన్నారు. పల్లెలలో నూటికి 40మంది మాత్రమే విద్యావంతులు. ఫిలిప్పీన్సులో నూటికి 52 పైగా చదువుకున్నవారే. బర్మా, సిలోను, చైనాల వంటి దేశాలలోగూడా విద్యాప్రచారం విరివిగా సాగుతున్నది. మన దేశంలో ఇది చాలా బ్రహ్మాండమైన సమస్య. మన దేశంలో సుమారు 10 మందిమాత్రమే అక్షరాస్యులు. అందుచేతనే భారతప్రభుత్వం విద్యాభివృద్ధికి ప్రథమ ప్రాముఖ్యం ఇవ్వాలని నిశ్చయించింది. ఈ విద్యాభివృద్ధి ప్రణాళికలో వయోజన విద్య చాలా ముఖ్యమైనది. మనం అందరము కలుసుకున్న ఈ సమావేశంలో వయోజన విద్యాభివృద్ధికి అవసరమైన వివిధమార్గాలు అన్వేషించాలి. శాస్త్రీయ విజ్ఞానాభివృద్ధివల్ల ప్రపంచానికి ఒక ప్రళయం వచ్చేటట్లు కనిపిస్తున్నది. ఈ ప్రళయం ఎదుర్కొనడానికి వయోజన విద్యాప్రచారంఒక్కటే పరిహారం. అదీగాక ఇప్పుడు వివిధ రాజ్యాల పరిపాలకులు తమకు ఇష్టం ఉన్నా లేకపోయినా యుద్ధానికి దారితీసేటట్లు ప్రవర్తిస్తున్నారు. వీరిని అరికట్టి ప్రపంచ శాంతి సాధించాలంటే సామాన్య ప్రజలు ముందుకువచ్చి తమతమ ప్రభుత్వాల చేత శాంతి మార్గాలు అవలంబింప చెయ్యాలి. ప్రజలు ఈవిధంగా ముందుకు రావటానికి వయోజనవిద్య చాలా అవసరం.

వయోజనవిద్యఅంటే మంచి పౌరులనుగా తయారుచేసే విద్య. ఈ వయోజన విద్యలో వయోజనులకు, చేతి పనులు, ఆరోగ్య సూత్రాలు, పౌరనీతి, ప్రపంచ రాజకీయాలు బోధించాలి."

ఆపిమ్మట వయోజన విద్యా వ్యాప్తికి కావలసిన అవసరాలను గురించి మాట్లాడుతూ మౌలానా అజాద్ ఇలాగ అన్నారు.

"మనం ఈసమావేశంలో వయోజనులకు ఏయే విషయాలు బోధించవలెనో నిర్ణయించాలి. మన దేశంలో పిల్లలకు పెద్దలకు సరియైన విద్యా ప్రచారం చెయ్యాలంటే 50 లక్షల ఉపాధ్యాయులు కావాలి. వయోజనవిద్యాశిక్షణమూడు మాసాలవరకే ఉంటుంది. అయినా ఒక్క వయోజనుల విద్యా ప్రచారానికి దరిదాపుగా 20 లక్షల ఉపాధ్యాయులు కావాలి. ఈ 20 లక్షల ఉపాధ్యాయులు వయోజన విద్యకేగాక, విద్యార్థుల శిక్షణకుకూడా ఉపయోగపడతారు. అయితే విద్యార్థులకు 10 లక్షల ఉపాధ్యాయులు లభించడమే కష్టమైపోతున్నప్పుడు, వయోజనుల విద్యాభివృద్ధికి మరి ఒక 10లక్షల ఉపాధ్యాయులను సమకూర్చుకోవడము మరింత కష్టము. అందుచే కొంతమంది చదువుకొన్న వారిచేత నిర్బంధంగా చదువు చెప్పించడం అవసరమేమో, అనిపిస్తున్నది. మెట్రిక్యులేషనులో ఉత్తీర్ణులయిన వారి చేత ఒక ఆరు మాసాలు నిర్బంధంగా చదువు చెప్పించినట్లయితే ఈ సమస్య కొంతవరకు పరిష్కరించవచ్చును. పేనిక్ ఉపాధ్యాయులను కూడా కొంతవరకు ఈ విషయంలో ఉపయోగించవచ్చునని భావిస్తున్నాను. మిమ్మల్నందరినీ ఈ విషయంలో సలహాలివ్వవలసిందని కోరుతున్నాను.

తరవాత వయోజనులు చదువుకున్నది మనం చేసుకోడానికి తగిన అవకాశాలను గురించి మాట్లాడుతూ ఈ విధంగా ఉద్బోధించారు. "సాహిత్యము, శీలము లు, మొదలైనవి ఈ విషయంలో బాగా ఉపయోగ పడగలవని నేను భావిస్తున్నాను. అయితే ప్రపంచంలో అన్ని దేశాలనుండీ ఇక్కడికి విచ్చేసి, ఈ సమావేశం జయప్రదం చేసిన విద్యావేత్తలు వయోజన విద్యకు సంబంధించిన సమస్యలలో తగిన సలహాలివ్వ గలరని భావిస్తున్నాను.

మనకు ఆదర్శాలలో అభిప్రాయ భేదం ఏమీ లేదని నా విశ్వాసము. అయితే ఈ ఆదర్శాలు ఆమలు పెట్టడంలోనే కొన్ని చిక్కులు వస్తున్నాయి. ప్రఖ్యాత విద్యావేత్తలు సమావేశమయిన ఈ సభలో జరిగిన చర్చల వల్ల ప్రపంచంలో వయోజనవిద్యలో బయలుదేరే సమస్యలన్నీ సులభంగా పరిష్కరించ బడగలవని భావిస్తున్నాను.

ఐక్యరాజ్య సమితి విద్యా వైజ్ఞానిక సంస్కృతి సభ యుద్ధాది ప్రమాదాలన్నీ మానవుల మనస్సుల లోనే ఉదయిస్తున్నాయనీ, అందుచేత మానవ మనస్సులలో ఉదయించే ఈ సంఘర్షణ బీజాలు తొలగించాలనీ సూచించింది. అందుచేత ఈ సమావేశం ఐక్యరాజ్య విద్యా వైజ్ఞానిక సంస్కృతి సభకు తగిన సూచనలు చెయ్యగలదని భావిస్తున్నాను."

ఆపిమ్మట తన ప్రారంభోపన్యాసం ముగిస్తూ అజాద్ ఇలాగ ఉద్ఘాటించారు. "ఈ ఉపన్యాసం ముగించే ముందు సభ్యులకు భారతీయచరిత్ర నుండి నేనొక విషయం జ్ఞాపకం చెయ్యాలని అనుకుంటున్నాను. ప్రపంచంలోని వివిధ సంస్కృతులకు తన ద్వారాలు తెరిచినప్పుడే భారత దేశం అత్యుత్తమ స్థితికి రాగలిగింది.

భారతదేశం ప్రపంచంనించి ఏది వచ్చినా కాదనకుండా, తనలోఉన్న మంచినంతటినీ ప్రపంచానికి అందిచ్చింది. వైవిధ్యంలో ఏకత్వం దర్శించడమే మా పరమలక్ష్యము. దీనివల్ల మా జీవనదృక్పథంలో గొప్ప సహనశక్తి ఏర్పడింది.

మహాత్మాగాంధీకూడా ఈ ఆదర్శమే మాకు బోధించారు. సహనమే భారత ప్రజలకు ఆయనఅందిచ్చిన సందేశము. ప్రేమకు, సహనానికీ ఆయన అత్యుత్తమ స్థానం ఇచ్చారు దీనివల్ల విభేదాలున్నా ఒకరొకరితో సహనభావంతో మెలగటానికి వీలవుతుంది. దీనివల్లనే నేటి ప్రపంచ సమస్యను మనం సాధించగలుగుతాము.

ఐక్యరాజ్యసమితి విద్యా వైజ్ఞానిక సంస్కృతిసభ, భారతప్రభుత్వము కలిసి ఈ సమావేశం ఏర్పాటుచేశాయి. దీనివల్ల ప్రపంచంలో అన్ని దేశాలమధ్యా సహకారం ఏర్పడి వయోజనవిద్య బాగా అభివృద్ధిచెందగలదని భావిస్తున్నాను."

### ఆసియాలో నిరక్షరాస్యతా నిర్మూలన: టోర్స్ బోడెట్ సందేశం

పారిస్, నవంబరు 1: ఆసియా గ్రామ ప్రాంతాలలో వయోజన విద్యావ్యాప్తికి పథకాలు వేయగలందులకై ఐక్యరాజ్య సమితి విద్యావైజ్ఞానిక సాంస్కృతిక సంఘం ఆధ్వర్యాన మైసూరులో బుధవారంనాడు విద్యావేత్తల సమావేశం ఒకటి జరుగనున్నది. ఈ సమావేశానికి సమితి సాంస్కృతిక సంఘం డైరెక్టరు జనరలు టోర్స్ బోడెట్ ఈ క్రింది విధంగా సందేశం పంపెను:—"అంతర్జాతీయ సహకారానికి భారతదేశం అంత ఫలవంతమైన క్షేత్రం ఇంకొకటి లేదు.

ప్రతి పురుషాంతరమూ తన తదనంతరం వచ్చే తరానికి జీవితాన్ని వీలైనంత సుఖప్రదంగా ఉండేట్లు చేయడానికి ప్రయత్నిస్తు ఉంటుంది; అది మానవుని నాటి నుంచి అనుకరణంగా ఈ ప్రయత్నం జరుగుతున్నది. మానవుని హక్కుల గురించి ఆలోచించేముందు మానవుని విధులేమిటో మనం యోచించాలి. గాంధీమహాత్ముడు చెప్పినట్లు, తన విధులను సక్రమంగా నిర్వర్తిస్తేనే, హక్కులను అనుభవించడానికి అర్హుడౌతాడు. ఈ మాటలే మీ చర్చలకు మకుటాయమానం కావాలి, విద్య అనేది కొద్దిమంది పెట్టెలో సొమ్ముగా ఉంచడానికి వీలులేదని మీరు కృతనిశ్చయులై ఉండబట్టే, ఆసియాలో నిరక్షరాస్యతను సమూలంగా నిర్మూలించడానికి మీరు ఇప్పుడు సాధనోపాయాలు వెతుకుతున్నారు. ప్రపంచంలో వెనకబడిన ప్రాంతం ఒక్కటి వున్నా, యావత్ప్రపంచమూ అంధకారబంధురమై ఉంటుంది. ప్రపంచంలో ఒక్క వ్యక్తికి హానికలిగితే, దాని మూల్యం మానవజాతినంతను కొదురుంది. ఈ సత్యాన్ని గుర్తించే మీ కృషికి ఇప్పుడు పూనుకున్నారు. భారతదేశపు మహాకవులలో ఒకరు తన జీవిత అవసానకాలంలో మానవుని లక్ష్యాన్ని ఈ విధంగా నిర్వచించెను:—"మానవజాతియొక్క ఆధ్యాత్మిక ఐక్యతను సాధించి తద్వారా మానవ శ్రేయస్సును సాధించడమే మన లక్ష్యం."

## హైదరాబాదు ఇలాకా మధిరలో తుఫాను

### వైరానది వరదలు

మధిర, అక్టో. 29: 27వ తేదీరాత్రి 12 గంటలనుంచి ఇక్కడ విపరీతమయిన పెనుగాలి, వర్షము ఆరంభమయినది. 28 తేదీ రాత్రివరకు విధి విరామము లేకుండా సాగినది. ప్రక్కనగల వైరానదిలో విపరీతమయిన వరదలు వచ్చినవి. నదీతీరమున గల గృహములన్నీ ఖాళీచేసి జనులంతాపట్టణమధ్య భాగమునకు చేరుకొన్నారు. మధిర చెర్వు అలుగు ప్రవాహమువల్ల రయిలుకట్టు 800 అడుగుల పొడవు నీటిలో మునిగిపోయి గండ్లు పడినవి. పట్టణములో అనేక ప్రాంతములలో చెట్లు, యిండ్లు కూలిపోయినవి. 28 తేదీన రావలసిన మోటార్లు నిలచిపోయినవి. సికింద్రాబాద్ నుండి బెజవాడ చేరవలసిన ప్యాసింజరు రయిలు మధిర దగ్గరువచ్చి నిలచిపోయినది. గాలివానవల్ల కొన్ని చెరువులకు కూడా గండ్లుపడినవి. వరి, జొన్న పయిరు చాలావరకు నష్టపడినట్లు భావించబడుచున్నది, గృహములు పడిపోయినటువంటి బీద ప్రజలకు వెంటనే తగు సహాయం చేయించుచూ గాలివానవల్ల నష్టపడిన పయిర్లను పంచునామాలు చేసి తలఖ్ మాలు మాఫీలు యివ్వవలసి వున్నది.

### మధిర తాలూకాలో నష్టం

దాదాపు 24 గంటలు విధి విరామం లేకుండా వీచిన పెనుగాలి, వానలవల్ల యిప్పటివరకు చేరిన వార్తలనుబట్టి ఈ తాలూకా మర్లపాడు, యినగాలి, రేబడిచర్ల, మాటూరుపేట, శబ్బువీడు గ్రామాల చెర్వులు తెగిపోయినవి. వరిపంటలు జొన్నపైరులు పూర్తిగా ప్రవాహములో కొట్టుకొనిపోయినవి. అనేక గృహములు పడిపోయి పశువులు వగైరా చనిపోయినవి. రైతులకు యీ గాలివాన విపరీతమైన నష్టంకలిగించినది. వరిపొలములు కంకివేసే దశలోనున్నవి. తెగిపోయిన చెర్వులను ప్రభుత్వం వెంటనే తాత్కాలికంగానైనా మరమ్మతు చేయించి పాడైపోగా మిగిలిన పొలములకైనా నీరు సప్లై అయ్యేలాగు చేయవలసియున్నది. లేనిచో పంటలు పూర్తిగా ఎండిపోయి రైతులు ఆహారధాన్యముల కొరకు మాడి చావవలసి వచ్చును. అని తాలూకా కాంగ్రెస్ సమితి అధ్యక్షుడు మద్దినేని రామకృష్ణయ్యగారు వ్రాసిరి.

### నర్సింపేట

నర్సింపేట (మానుకోట తా॥) నవం 1: గత గురువారంవచ్చిన తుపానువల్ల నర్సింపేటలో పైరులకు విపరీత నష్టం కలిగింది. మోటార్లు రాకపోకలు ఆగిపోయినవి. అక్కడక్కడ రోడ్లు తెగిపోయినవి. ఇంతవరకు తిరిగి కార్లు నడపలేదు. వరి పైర్లకు తీరనినష్టంకలిగి తేపీ ఇవ్వలేమని నిన్న ఓరుగల్లుజిల్లా సివిల్ పరిపాలనాధికారి దగ్గర వినతిచెప్పుకొన్నారు.

జిల్లాకలెక్టరు పలనియప్పన్ గారు ముదుపుగల్లు రైతులకేసును విచారించుటకు గాను వచ్చి తిరిగి ఈరోజు వరంగల్ వెళ్లిరి.

# ఉత్తర, దక్షిణ విశాఖజిల్లాలకు కలిగిన నష్టం విపరీతం

## ఈతుపాన్‌లో దాదాపు 200 మంది మరణించిఉంటారనిరా.కాం.కార్యదర్శి అంచనా

### గుంటూరు, కృష్ణాజిల్లా గ్రామాల నష్టం గురించి మరికొన్ని వివరాలు

విజయవాడ, నవంబరు 2: ఆంధ్రరాష్ట్రంలో యిటీవలవచ్చిన తుపాను, వరదలవల్ల యింతవరకు దాదాపు 200 మంది మరణించినట్లు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యాలయానికి వచ్చినవార్తలనుబట్టి ఊహిస్తున్నది.

రాష్ట్ర కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి ఓబులరెడ్డిగారు నేడు ఒక ప్రకటన చేస్తూ, పంట నష్టం అనేక కోట్ల రూపాయల వరకు ఉండునని అన్నారు. ధనసంతులు కావలసిన రైతులనేక మంది యీ తుపాను తాకిడి వల్ల నిరుపేదలై పోయారు. ప్రభుత్వం వెంటనే బాధితులకు సహాయపడవలెనని ఓబులరెడ్డిగారు కోరారు.

### శారదా, వరాహా, తాండవ నదులలో వరదలు

యలమంచిలి, నవంబరు 1: ఇక్కడ అక్టోబరు 26 న గాలి,వానా ప్రారంభమై 28 వరకూ అంతకంతకు అధికమవుతూ వచ్చింది. ఈ తాలూకాలో ప్రవహించే శారద, వరాహా, తాండవనదులలో వరదలు వచ్చాయి. నర్సీపట్నం, యలమంచిలి, బయ్యవరం స్టేషన్లమధ్య రైలు కట్టకు గండ్లుపడినవి. రోడ్లకుకూడా గండ్లుపడి రాకపోకలు స్తంభించిపోయాయి. వరిపైరు మొట్టమొదటైన చోడి పూర్తిగా నీటమునిగిపోయింది. పశునష్టం ఎంతజరిగిందో చెప్పవలవికాదు. 36 దుక్కలవర్షం కురిసింది. చాలాఇళ్ళు పడిపోయాయి. వీధులు 4 అడుగుల నీళ్ళలో మునిగిపోయాయి. నదుల నానుకొనివున్న 50 గ్రామాలకు చాలా నష్టంకలిగినట్లు తెలుస్తున్నది. నష్టం వివరాలు తెలియలేదు. తాసిల్దారుగారు వరదబాధితుల సహాయసంఘము ఏర్పాటు చేశారు.

### ఉత్తరవిశాఖ జిల్లాలో విపరీత నష్టం

చికాకోల్, అక్టోబరు 29: నాగావళి, వంశధార నదులలో వరదలువచ్చి చికాకోల్, నరసన్నపేట, చీపురుపల్లి, పాలకొండ, పాతపట్నం, పార్వతీపురం తాలూకాలకు చాలా నష్టం కలిగినట్లు తెలుస్తున్నది. ఈ వూళ్లో సున్నపువీధి, సనకిధి, కెళ్ళవీధులలోకి నదీప్రవాహం పొరలివచ్చి చాలా ఇళ్లు పడిపోయాయి.

ఉదయము రెండు, మధ్యాహ్నము మూడు పూరిండ్లు నాగావళిలో కొట్టుకొని పోయినవి. పశువులు కొన్ని కొట్టుకొనిపోయినవి. వర్షము విపరీతముగా పడుట చేతను వరద యేమియూ తగ్గకపోవుటవల్ల పట్టణ ప్రజలు ప్రవాహమునకు భీతిల్లుచున్నారు.

మధ్యాహ్నము. మండలివీధి, గూనపాలెము హరిజన వీధులందు నీరు చేరినట్లు తెలిసినది.

1931 వ సంవత్సరములో యీ పట్టణమునకు 20 అడుగుల నీరువచ్చి పట్టణములో మూడవ వంతు వరద దెబ్బతిని యుండెను. ఇప్పుడంతటి ప్రమాదమైన ప్రవాహము యింకనూ లేకపోయినను 1943 లో గాలివానకు దెబ్బతిని యుండుట చేతను ప్రజలు అప్పటికంటె ఆహార విషయములలో మిక్కిలి విపరీతమైన కష్టనష్టములతో యుండుటవల్ల భీతిల్లుచున్నారు.

### సున్నంపాడు

సున్నంపాడు, నవంబరు 1: అక్టోబరు 27 రాత్రి 11 గంటలుగాయితు 28 తారీఖు మధ్యాహ్నము 2 గంటలవరకు గాలి వర్షం వల్ల ఈ గ్రామంలో సుమారు 70 యిండ్లు కూలిపోయినవి. సున్నంపాడు జమీందారుగారి శ్రీరామ విలాస్ భవనములో 200 మంది, యర్రబోలు లక్ష్మీనృసింహస్వామి శ్రీకృష్ణవిలాసభవనములో 200 మందిలెలు దాచుకొని ప్రాణములు మాత్రం కాపాడుకో గలిగినారు. 7 8 పశువులు చనిపోయినవి. పంటలు, పైరులు నష్టపడినవి.

### మైలవరం ఫిర్కా

మైలవరం, అక్టోబర్ 31: ఫిర్కా గ్రామాలలో తుపానువల్ల యిండ్లు పడిపోయి, పశువులు మేకలు ప్రవాహములో నష్టపడినవి. పంట చెరువులన్నియు భరదచే గండ్లుపడి నీటిబొట్టుకూడా లేకుండా పోయినది. చెరువులు మరమ్మతు చేయనిచో అన్న పంటైనా పండుట దుర్లభమని ప్రజలు నిరుత్సాహ పడుచున్నారు. మెట్టపైరులు కూడా చాలా నష్టపడినవి. కార్మికుల ఇండ్లు, నామమాత్రమైనా లేకుండా పోయినవి.

### గంగినేనిపాలెం

గంగినేనిపాలెం (బెజవాడ తా॥) అక్టోబరు 31; 27 వ తేదీ సాయంకాలం ప్రారంభమై 28 వ తేదీ రాత్రి వరకూ కొట్టిన తుపాను మూలంగా ఈ గ్రామంలో యిండ్లకు పంటలకు విశేషనష్టం వాటిల్లింది. చాలా యిండ్లు గోడలు కూలిపోయినవి. పోగా మిగిలినవాటి పైకప్పులు లేచిపోయినవి. దట్టముగా పెంకు వేసిన ఇండ్లకు కూడా పైకప్పులు లేవు. మిరప, జొన్న, కంది వగైరాపైర్లు పూర్తిగా పాడైనవి. కోసి భూమిపై వేసిన నల్ల వరిపంట ధ్వంసమైంది. ఊరికి తూర్పు పడమరగా ఉన్న చెరువులు గట్లు తెగి ఊరిపై బడకుండా, తుపాను గాలిలోనే గ్రామస్థులువెళ్లి గట్లు తెంపి నీరు వేరేదిక్కుకు మళ్ళించారు. చుట్టుప్రక్కల గ్రామాల్లో ఉన్న చెరువులన్నీ తెగిపోయినవి. గ్రామంలో ప్రాణనష్టంగాని, పశునష్టంగాని లేనట్లు తెలుస్తున్నది.

### లంకపలిఅగ్రహారం

లంకపల్లి అగ్రహారం, (గన్నవరం తా॥) అక్టోబరు 31: 27, 28, తేదీలలో తుపాను వల్లను బుడమేరు, వన్నేరు వరదలవల్లను ఈ గ్రామంలోని గ్రంథాలయ భవనము, హయ్యరు ఎలిమెంటరీ పాఠశాల సుమారు 150 యిండ్లు నేలకూలినవి. ఒక స్త్రీ చనిపోయినది. ఒక దుర్గవానికి చెయ్యి విరిగినది. పశునష్టం 50 వరకు గలదు. పైరునష్టం చెప్పటకు వీలులేదు. మొత్తంనష్టం సుమారు రూ 50,000/-లు ఉండునని అనవచ్చు. కార్మికులు ఒక వయ్యిమంది నిలువ నీడ తినతిండిలేక అల్లాడుచున్నారు.

### గుంటూరు జిల్లా గ్రామాలకు కలిగిన నష్టం వివరాలు

పొన్నూరు, నవంబరు 1: తుంగభద్ర కాల్వ పొంగి చుట్టుపట్ల గ్రామాలను జలమయం చేసింది. ఆరెమండ గ్రామంయితర ప్రదేశాలనుంచి పూర్తిగా వేరుపడిపోయింది. సుమారు 70 యెకరాల పసుపు, పూర్తిగా మునిగిపోయింది. 50 యెకరాల అరటితోటలు సర్వనాశనం అయినవి. వరిపైరు పూర్తిగా మునిగిపోయి అక్కడక్కడా తలలుమాత్రం కొంచంగా గోచరిస్తున్నవి. హరిజనవాడ పూర్తిగా జలమయం అయింది. యీ పరిస్థితినుంచి రక్షించమని, తగిన సహాయం చేయుమని, కలెక్టరుగారికి టెలిగ్రాం యిచ్చారు.

ఆలూరు గ్రామం జలమయం అయిపోయింది. సుమారు 20 యెకరాల పసుపు, యితర మెట్టపైరులు యావత్తు దెబ్బతిన్నవి. వరిచేలు మునిగిపోయినవి ఆలూరు నుంచి నిడుబ్రోలు స్టేషనుకు వచ్చుదారి యావత్తు ఒకక్రొత్త సముద్రమయినది.

మునుకుదురువద్ద వంతెన దిగువభాగం మునిగిపోయి, నీరు రోడ్డుమీదుగా ప్రవహించుచున్నది. నీటి ప్రవాహం హెచ్చుచున్నది.

బాపట్ల నిడుబ్రోలు రోడ్డుమీద అప్పికట్ల సమీపంలో వంతెన విరిగి, పడుటకు సిద్ధంగా వుంది. మునుకుదురు నుంచి సందూరుదాకా జలమయం. వరిచేలు పూర్తిగా మునిగిపోయినవి. నీరు తప్ప మరేమీ కనుపించుటలేదు.

పొన్నూరు అమెరకన్ హాస్పిటలు చుట్టు నీరు నిలచివున్నది. దాపులో నున్న యానాది వగైరా గుడిసెలు జలమయం అయినవి. ఖాళీజేసి, అచ్చటచ్చట కాచుకొని తిరుచున్నారు. రోడ్డుమార్జిన్ అవతల వున్న గృహస్థులు, రోడ్డుకు రావలెనంటే తొడల లోతు నీళ్ళలో వస్తూయున్నారు. అంతకంతకు తుంగభద్రలోని నీరు అధిక మగుచున్నది. నిన్న మధ్యాహ్నం మరల వర్షం కురిసింది. యింకా మబ్బులు వేస్తున్నవి.

రేటూరు, అప్పాపురం, గరికపాడు వగైరాలు మరింత అధ్వాన్న స్థితిలో వున్నట్లు తెలుస్తున్నది. యీ రోజు వుదయం ఒంగోలు సబ్ కలెక్టరు ఎ. కృష్ణస్వామిగారు, పొన్నూరు డిప్యూటీ తహశీల్దారు గణపతి సుందరంగారు ఆ ప్రదేశాలకు వెళ్లారు. (స్వ. వి.)

### కనగాల

కనగాల, నవంబరు 1: ఈ గ్రామములో అక్టోబరు 29 నుంచి వీచిన గాలివాన మూలమున వందలాది ఇండ్లు, గోడలు పడి ప్రజలు నానా ఇబ్బందులు పడుచున్నారు. 500 ఎకరములు వరిపైరు నీట మునిగిపోయినది. ఇలా ఇంకా రెండు రోజులు వున్న ఎడల పైరులు సాంతముగా నాశనము కాగలవని రైతులు భీతి చెందుచున్నారు. కొన్ని వేల ఎకరములు మునిగిపోయినవి.

ఈ తాలూకాలో చేనేత పారిశ్రామికులు చాలా ఎక్కువ. గాలివానల మూలమున వారికి వున్న పూరిగుడిసెలు నూటికొంపైగా పడిపోయినవి. నానా బాధలు పడుచున్నారు.

### సత్తెనపల్లి తాలూకాలో నష్టం

సత్తెనపల్లి, అక్టోబరు 31: ఈ తాలూకా కాంగ్రెస్ స్పెషల్ ఆఫీసరు బి. సత్యనారాయణ రెడ్డి, జిల్లా కాంగ్రెసు సభ్యుడు వార్ల వెంకటేశ్వర్లు గారు ఇట్లు వ్రాశారు: ఈ తాలూకాలో నిన్న వీచిన గాలివాన వల్ల తాలూకా అంతటా విపరీత నష్టాలకు ప్రజలు గురియైనారు. ఇండ్లు కూలినవి. మిరపపొగ తోటలు వర్షాధిక్యత వల్ల కుళ్ళి పోతున్నవి. వరిగె పైరు పూర్తిగా నష్టపడింది. పూరి కొంపలు ఎచ్చట్లానిల్చుటకైనా వీలు లేకుండా పోయినవి. వెంటనే ప్రభుత్వము, నిరాధారులైన గృహాలు లేని బీదలకు, యిండ్లు నిర్మించుటకు కాట ఆకు, చెట్లు ఉచితంగా పర్మిట్లు చేసి, యీ సంవత్సరం తాలూకాలో శిస్తు రిమిషన్ యిచ్చి బాధితులకు తోడ్పడ కోరుచున్నాము.

### తాడికొండ

తాడికొండ, అక్టోబరు 31: ఈ నెల 27, 28 తేదీలలో ఈ గ్రామములో విపరీతమయిన గాలితోకూడిన వర్షమువల్ల రయితులకు, కూలీలకు తీరనినష్టము వాటిల్లినది. చెట్లు పడిపోయినవి. పక్షిజాలము అపరిమితముగా చనిపోయినవి.

అక్కదేవతల చెరువు, పూర చెరువు రెండునుకలసి కట్టలుతెగి పూరంత నీటిమయమైపోయినది. పశువులకు గ్రాసము లేకపోవుటయు, ప్రజలు యింటిముంగిలి బయటికివచ్చి వేయుటయూ, తిండి లేకపోవుటయు సంభవించినది. చాలాయిండ్లు పడిపోయినవి. గ్రామములోని పాగాకు బారన్ల రేకులు ఎగిరిపోయినవి. సత్రములు ఖాళీగాలేనందున గ్రామములోని బీదవాండ్రు గాలివర్షము సమయములో తలదాచుకొనుటకు వీలులేకపోయినది. పైరు నష్టముకలిగినది. 2 లక్షల రూపాయలకు పైగా నష్టము కలిగించినది.

### టెలిగ్రాఫ్‌లైను సరిచేయడానికి త్వరితకృషి
#### నూజివీడు అన్నవరంమధ్య రైళ్ళ రాకపోకలు

(స్వకీయ విలేఖరి)

విజయవాడ,నవంబరు 2: టెలిగ్రాఫ్స్ శాఖ డైరెక్టరు కె. వి. రంగస్వామి, మదరాసు సర్కిల్ డివిజనల్ ఇంజనీరు బి. రాజగోపాల్‌తో నిన్న ఉదయం ఇక్కడికి వచ్చారు. టెలిగ్రాఫ్, టెలిఫోన్ తీగెలు తిరిగి బిగించే పనులు త్వరత్వరగా జరిపిస్తున్నారు. ఇప్పటికి దాదాపు అన్ని వైపులకూ కబురులు అందుతున్నవి. విజయవాడకు ఉత్తరాన గల ప్రదేశాలకు మాత్రం మరి మూడు రోజుల వరకూ కబురులు అందవని తెలిసినది. గన్నవరం, నూజివీడుల మధ్య తీగలు, స్తంబాలు పూర్తిగా ధ్వంసం అయి పోవడమే ఇందుకు కారణమంటున్నారు. 400 మంది 8 బృందాలుగా ఈ లైను సరిచేయడానికి పని చేస్తున్నారు. మరి అవతలలైన స్థితి ఎట్లావుందీ ఏమీ తెలియలేదు.

రైళ్లు ఇటు విజయవాడనుంచి గన్నవరం వరకూ, అటు నూజవీడునుంచి అన్నవరం వరకూ నడుస్తున్నవి.





బందరు వీధులన్నీ మూడురోజుల పాటు జలమయమై ఉన్నవి.



బందర్లో తుపాను విధ్వంసం: నిర్మాణంలోవున్న ఒక సినిమాహాలు పూర్తిగా కూలిపోయింది. (1,3 చిత్రాలు) రాబర్ట్సన్ పేట్వ్యవసాయదున్న షరాబు సుకాణాలన్నీ పూర్తిగా ధ్వంసమైనవి. (3 వ చిత్రం)

## గంటల పంచాంగం

విరోధి నం॥ కార్తీక శు॥ త్రయో॥
1949 నం॥ నవం॥ 3 గురువారం
సు॥ త్రయోదశి రా 9-30 ఉ భా ఉ 7-3 వర్జ్యం రా 8-37 ల 10-25కు.
శు॥ చతుర్దశి నవం॥ 4 శుక్రవారం
సు॥ చతుర్దశి రా 12-9 రే ప 10-12 వర్జ్యం లేదు.

ఆంధ్రపత్రిక

విరోధి నం॥ కార్తీక శు॥ త్రయో॥
గురువారం

## తుపాన్ బాధితులకు సహాయం

తుపాను తగ్గిపోయి వారము రోజులగుచున్నను ఇంత వరకు తూర్పు, పశ్చిమ గోదావరిజిల్లాల నుండి ఎట్టి వర్తమానము లేదు. విశాఖపట్నము జిల్లాలో కొంత భాగమునుండి కృష్ణా, గుంటూరు జిల్లాలనుండి మాత్రమే తుపాను బీభత్స మెంత విపరీతముగ నున్నదో ఊహించుటకు మాత్రం ఉపయోగపడగల వార్తలు వచ్చినవి. కృష్ణాజిల్లాలో ముఖ్యముగ నష్టపోని ప్రాంతమున్నట్లు కన్పించదు. వెల్లువతీసి, వాతావరణస్థితి యథాప్రకారమైన ఆస్తికి కలిగిన నష్టమును అంచనా వేయుట కొంతవరకు సాధ్యముగావచ్చును. కాని కోస్తాజిల్లాలందుకలిగిన ప్రాణ నష్టము లెక్కకట్టుట ఇంతలో సాధ్యముగాదు. ప్రతి గ్రామము నందును కొద్దిగనో, గొప్పగనో ప్రాణనష్టము కలిగినట్లు ఇంత వరకు వచ్చిన వార్తలను బట్టి గ్రహింపవలసి యుండెను. కొన్ని కుటుంబములు పూర్తిగ నాశనమై యుండవచ్చును. మరికొన్ని కుటుంబములందు, సంసారభారమును భరించుచుండిన ముఖ్యులు పోయి ఉండవచ్చును. ఇట్టి కుటుంబములకు అన్నివిధముల జీవనాధారము పోయియుండెను. ఈ నష్టమును ప్రభుత్వము, ప్రజాసంస్థలు ఖర్చుచేయు మొత్తములతో భర్తీ చేయుట సాధ్యముగాదు. ప్రస్తుత తుపాన్ నష్టమునుండి కోలుకొని పూర్వస్థితినిబొందుట అనేకమందికి ఇంతలో సాధ్యముగాదు. "బాధితులైన ప్రజలు ఇళ్లువేసుకొని తమ పనిపాటలు మొదలుపెట్టుటకు కొన్నిలక్షల రూపాయిలు అవసరము." అని తుపాన్‌కు గురియైన కృష్ణాజిల్లాలోని కొన్ని ప్రాంతములను పర్యటించిన కాంగ్రెస్ కార్యదర్శి శ్రీ కళా వెంకట్రావుగారు ప్రకటించిరి. అప్పటికి వారు కొన్నిప్రాంతములను మాత్రమే చూచియుండిరి.

విశాఖపట్టణము మొదలు గుంటూరు వరకు ఉన్న కోస్తా ప్రాంతమంతయు విపరీతముగ నష్టపడియుండునని, బందరు, దివి, కైకలూరు, గుడివాడ తాలూకాలలో కలిగిన నష్టము వివరములను బట్టి ఊహింపవలసియున్నది. ఈనష్టము ఎన్ని కోట్లరూపాయి లుండునో సరియైన అంచనా ఎన్నటికి లభింపదు. అధికార, అనధికార సంస్థల దృష్టికి రాని నష్టమెంతయో ఉండగలదు. ఇంత నష్టమునకు ధనరూపమున పరిహారమిచ్చుట సాధ్యముగాదు; సాధ్యమైనను కలిగిన నష్టము పూర్తిగ తీరదు.

వేల ఇండ్లు కూలిపోయినట్లు పురపాలకసంఘమువారు అంచనా వేసిరి. అన్ని ఇండ్లను ఆపట్టణములో నిర్మించుట ఎన్నటికి సాధ్యమగును? అట్లే కోస్తాజిల్లాలందు కొన్నివేల ఎకరముల పైగా నష్టమైనది రాబోవు సంవత్సరమునకు ఈ భూమిపై ఆధారపడిన వారికే గాక, వారిపై యాధారపడియున్న ఇతర తరుగుజిల్లాలవారికిని తిన గింజయుండదు. ఈ జిల్లాలు మిగులు జిల్లాలని ఇదివరలో పండిన పంట ఇతరజిల్లాలకు ఎగుమతియైనది. శేషము తుపానుపరమైనది. ఈ విధముగ ఈ ఆరు జిల్లాలు దాదాపు మూడు సంవత్సరములవరకు తీవ్రమైన ఆహార కొరతను అనుభవింపవలసి యుండును.

ప్రభుత్వ మీ జిల్లాలకు తాత్కాలికముగ సహాయకార్యములకు రెండులక్షల 45 వేల రూపాయిలను మంజూరుచేసినది. ఆ మొత్తమునకు పదిరెట్లు గాదు అంతకు మరి పదిరెట్లు మంజూరు చేసినను జరుగగలపని అత్యల్పము. అట్లని ప్రభుత్వము ఇప్పటివలెనె ఉదాసీన వైఖరిని అనుసరించుట క్షంతవ్యముగాదు. ప్రభుత్వము వెంటనె ఆయా ప్రాంత అవసరములను బట్టి ధనమును మంజూరుచేసి అది సద్వినియోగమగునట్లు చూడవలసియున్నది. తుపాను వలన పూర్తిగ నాశనమైపోయిన గ్రామముల, గ్రామస్తుల పునరావాస సమస్య ప్రభుత్వము మంజూరుచేయు గ్రాంట్లవలన పరిష్కారముగాదు. బ్రహ్మాండమైన కార్యకలాపమును అమలుచేయ వలసియున్నది. అందుకు వెంటనే పూనుకొనవలసియున్నది. జాప్యమువలన కొన ఊపిరితో నున్న గ్రామములు, గ్రామస్థులు కూడ దక్కకపోవచ్చును. ఇప్పటికీ తూర్పు, పశ్చిమ గోదావరిజిల్లాల నుండి పూర్తివివరములు ప్రభుత్వమునకు అందినట్లులేదు. కాని ఈలోపున కృష్ణాజిల్లాలోదాదాపు అన్నిప్రాంతములనుండి పరిస్థితులెట్లున్నవో తెలిసినవి. కనుక గుంటూరు, కృష్ణా జిల్లాలందు నష్టమునకు తగ్గట్టుగ సహాయకార్యక్రమము ప్రారంభము కావలెను.

ప్రభుత్వముపై ఆధారపడినందువలన ఇంతవరకు ఏ సందర్భమునందును ప్రజల యవసరమునకు తగ్గసహాయము జరుగలేదు. ప్రభుత్వము తన కర్తవ్యమును గ్రహించుసరికే పరిస్థితులు విషమించిపోవును. ప్రజాసంస్థలు ఇతర ప్రాంతములందున్న ప్రజలే మహత్తర కార్యక్రమమునకు పూనుకొనవలసియుండును. చెన్నరాష్ట్ర ప్రభుత్వము తన ఉనికిని సమర్థించుకొనుటకు లభించిన ఈయవకాశమును సద్వినియోగము చేసుకొనునని ఆశించుచున్నాము.

## పటేల్ ఉద్బోధ

(1 వ పేజీ తరువాయి)

కు సేటట్లు నర్తించేలాను చేయవలసిందిగా భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను.

నిన్న నేను ఢిల్లీలో మాట్లాడుతూ దేశంలో ప్రబలంగా వున్న సమస్యలను పరిష్కరించడంలో అందరి సహకారము అవసరమని, ప్రతివారు ముందు వెనుకలు పాటించాలని, సమస్యను జాగ్రత్తగా అర్థం చేసుకోవాలని విజ్ఞప్తి చేసివున్నాను. వచ్చేపేడు మనం ఎన్ని కష్టాలను పడవలసి వుంటుందో కూడా నేను ఆ సందర్భంలో మున్ముందుగా సూచించాను. ఆ మాటలనే నేను తిరిగి ఇప్పుడు కూడా చెప్పదలచుకున్నాను. మనం ఎటువంటి కాలాల్లో వున్నామో, జాగ్రత్తగా విచారించవలసిందని తిరిగి నేను దేశీయులందరికి విజ్ఞప్తి చేస్తున్నాను.

ఈకాలం ఇట్లావసించడానికి కారణం ఏమిటో నిర్ణయించే అధికారాన్ని చరిత్రకు వదలండి. ప్రకృతానికి మనం ఒక [illegible]

కృత్రిమకృత్యను చూపించుకోవడం, తప్పులు దిద్దుకోవడం, కొంతకాలంపాటు వాయిగా వేయడంగాని. దేశంబలపడి అందరికి తిండి గుడ్డా ముట్టేనాడు వచ్చిన తరువాత ఈ వాదోపవాదాలకు దిగుతే బాగుంటుంది.

ఈ వాదోపవాదాలవల్లమనకు జరిగే లాభం ఏమీలేదు. మనం కార్యకౌశలం కాకుండా చూడటానికి మాత్రంఇవిబాగా పనికివస్తాయి. ఇప్పుడు మనం కర్తవ్యతావిమూఢులం అయ్యేందుకు వీలులేదు. రాజకీయ విషయాల్లో అనండి, ఆర్థిక విషయాల్లో అనండి పురుషకారం అత్యవసరంగా గోచరిస్తున్నది. వాస్తవదృష్టితో మనం ఈ సమస్యలను ఎదుర్కొందాం. బాధ్యతతో వాటిని పరిష్కరిద్దాం.

అట్లా చేసినపక్షంలో ఏది అవసరం, ఏది అనవసరం అనేది త్వరగా తేలుతుంది. అప్పుడు మనం అవసరమైనదాన్ని, అనవసరమైన దాన్నుంచి విడదీసి, అవసరమైనది నిర్మాణ కార్యకలాపాలకు ఉపక్రమించడం తేలికపని అవుతుంది. ఇందులో స్వప్నాలకు తావులేదు. స్వప్నాలు ఎప్పుడూ స్వప్నాలే. ఒక అపూర్వ ప్రపంచాన్ని నిర్మిద్దామనుకుంటూవున్న స్వప్నముగా వున్నంతవరకు బాగానే వుంటుంది కాని వాస్తవిక దృష్టితో దాన్ని పరికించవలసివచ్చేటప్పటికి అదివట్టి ఎండమావు క్రింద తయారై పూరుకుంటుంది.

అందువల్లమనం కార్యకారుల్లాగా, దైనందిన జీవిత వ్యాపారంలో అతియైన సంబంధం పెట్టుకొని, అచ్చట తోచే సమస్యలను పరిష్కరించడానికి సహకారబుద్ధితో పూనుకొన్నట్లయితే ఆ మనకున్న దానికంటే ముందుగానే, ఈ కష్టాల్లోంచి బయటపడగలమని నా కు గట్టినమ్మకం వుంది. అంతేగాని ఈ పద్ధతి మంచిదంటే ఈ పద్ధతి మంచిదని, ఈ 'ఇజం' మంచిదంటే ఈ 'ఇజం' మంచిదని వాదోపవాదాలకు దిగితే జరిగేదేమీ లేదు.

ఈ రోజునకూడా ఇదే సందేశాన్ని నా దేశీయులకు నేను ఇవ్వదలచుకున్నాను. ప్రస్తుత సమస్యలకు, నా సందేశానికిగల సంబంధాన్నికూడా వారు బాగా గుర్తించగలరని కూడా భావిస్తున్నాను.

నా కంటారా జీవితం పశ్చిమదిశలో పడిపోయింది. కాలం పూరికే పరుగెత్తుకు పోతోంది. నేనెంతకాలం బ్రతుకుతానో అనేది దగ్గరలోకి వచ్చేసింది. అటువంటి సమయంలో కూడా నా దేశప్రజలసేవ చెయ్యడానికి అవకాశం కల్పించిన భగవంతునికి ధన్యవాదాలు అర్పిస్తున్నాను.

నేను గడచిన మూడు సంవత్సరాల్లోను నా శాయశక్తుల దేశాన్ని ఆరాధించాను. ఈ కాలంలో ఏమి జరిగిందో, అది చరిత్ర అట్లా జరగవలసివుండి జరిగినా, నే నేదో చేశానని నా సమకాలికులంతా అన్నారు. వారు అట్లా అన్నారంటే, అది వారికి నాపట్లగల ప్రేమ గౌరవాలను, ఆదరాభిమానాలను ప్రదర్శిస్తున్నది.

ఇంకా నేను బ్రతికివున్నంతవరకు, ఈ ప్రజల ప్రేమ, గౌరవం, ఆదరం, అభిమానం, నాపట్ల ఈలాగే వుండనీయవలసిందని, నేను అందుకు తగినవాడినని ఋజువుచేసుకునే భాగ్యం, నాకు కల్పించవలసిందని భగవంతుణ్ణి అర్థిస్తున్నాను.

## ఆంధ్రదేశంలో పటేల్ జన్మదినోత్సవం

### హిందూపురంలో

స్థానిక ప్రాథమిక శిక్షణ విద్యాలయం వారు సర్దార్ పటేలు జన్మదినోత్సవమును 30 వ తేదీ, ఉదయంనుండియే ప్రారంభించిరి. ఉదయం విద్యార్థులు ప్రభాతభేరీ జరిపి, దినమంతయు అఖండ సూత్రయజ్ఞం జరిపిరి. జిల్లా విద్యాధికారి జనాబ్ మహమ్మదు ఇస్మాయిల్ గారు పతాకారోపణ చేసిరి. ఈ సందర్భమున వయోజన విద్యా గౌరవసభ్యులుగాడి చెర్ల హరి సర్వోత్తమరావుగారు మాట్లాడుచు సర్దారుపటేలు ప్రతిభా విశేషములను గుణగణములను ప్రస్తుతించిరి.

స్థానిక మునిసిపల్ హైస్కూలునందు కూడ సర్దారు పటేలు జన్మదినోత్సవం జరిపారు. (స్వ. వి.)

### బెంగుళూరులో

బెంగుళూరు ఆంధ్రబాలసరస్వతీసంఘం, ఆంధ్రకర్నాటక ఏకీకరణ సంఘమువారు సర్దార్ పటేల్ జన్మదినోత్సవం జరిపారు. ఆ సందర్భమున పి. హెచ్. జగదీశ చంద్రరాయలు గారి అధ్యక్షతను జరిగిన సభలో పటేల్ గుణగణములను ప్రశంసిస్తూ పలువురు ప్రసంగించారు.

ఆర్. యస్. యస్. అధిపతి ఎమ్. ఎస్. గోల్వాల్కర్ ఈ 1 న బెంగుళూరు వచ్చారు. ఆయనకు పురమందిరంలో స్వాగత సన్మానం జరుగుతుండగా స్థానిక సోషలిస్టుపార్టీ వలంటీర్లు 31 మంది నల్ల జెండాలు పట్టుకొని వ్యతిరేక ప్రదర్శనము చేయటానికి బయలుదేరారు. వీరిని పోలీసులు అటకాయించి కస్టడీలోకి తీసుకుని కొంతసేపయ్యాక వదలివేశారు.

## లెక్కల ప్రాధాన్యం

### ఢిల్లీలో శిక్షణకేంద్రప్రారంభం

### జయరాందాస్ దౌలత్ రాం ప్రసంగం

మ్యాథిలీ, నవంబరు 1: వివిధ విషయాలకు సంబంధించి లెక్కలను తయారు చేసేందుకుగాను, అంతర్జాతీయశిక్షణకేంద్రమునకు, భారతప్రభుత్వ ఆహారశాఖామంత్రి జయరాందాస్ దౌలత్ రాం ప్రారంభోత్సవం జరుపుతూ, వివిధదేశాల మధ్య యేర్పడిన సంకుచిత జాతీయతత్వమనే తారతమ్యమును తొలగించి, ప్రజాసామాన్య క్షేమమునకు పరస్పర సహకారంతో పనిచేయవలెనని ప్రతినిధులకు ఉద్బోధించారు. ఈ సమావేశమునకు, భారతదేశప్రతినిధులు, ఆగ్నేయ ఆశియా ప్రతినిధులు మొత్తం 50 మంది హాజరైనారు. ఇప్పుడు ఢిల్లీలో, నెలకొల్పబడుతున్న యీ శిక్షణకేంద్రం, ఐక్యరాజ్యసమితి ఆహార వ్యవసాయసమితిని ప్రపంచంలో వివిధప్రాంతాలలో స్థాపించదలచిన శిక్షణకేంద్రాలలో ఒకటి. ఇది యావత్తు ఆగ్నేయ ఆశియాదేశాల ప్రయోజనార్థం, భారతప్రభుత్వం సహకారంతో, సమితి ఆహార వ్యవసాయసమితిచే స్థాపింపబడినది.

జయరాందాస్ ఇంకా ఇలా చెప్పారు.

"ఇలాంటి అంతర్జాతీయ సమావేశాలు జరగడంవల్ల, మనమంతా ఒకేరకమైన సమస్యలు, ఒకేరకమైన ఆశయాలు గలిగి, అన్యోన్యంగా పనిచేస్తూ, జాతివర్ణవివక్షతలేకుండా ప్రజాసామాన్య క్షేమమునకు పరస్పరం సహకరించి పనిచేయవలసిన మానవులమనే భావం కలుగుతుంది.

ప్రపంచ ఆర్థిక, సాంఘిక విషయాలకు సంబంధించి సమగ్రమైన లెక్కలుతయారుచేయవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. మన పరిసరాలపట్ల, మనచుట్టూ వాతావరణంపట్ల, మనం చైతన్యవంతమైన దృక్పథం కలిగివుండాలి. మనంసుఖసౌభాగాలను అందుకోగలగాలంటే సవ్యంగా ప్లాను వేసుకోవడం అవసరం. ఆయా విషయాలకు సంబంధించిన లెక్కలను సరిగా తయారు చేసుకొని, దానిని ఆధారంగా తీసుకొని వేయని ప్లాను వ్యర్థం. చుట్టూవున్న స్థితిగతులను వాతావరణాన్ని అవగాహన చేసుకోకపోవడంవల్లనే మానవుడు అభ్యుదయం పొందలేక బాధపడుతున్నాడు. కాని సరియైన లెక్కలుంటే, తన పరిసర పరిస్థితులను స్పష్టంగా అవగాహనచేసుకోగలుగుతాడు. తనసమస్యలను, శాస్త్రీయంగా పరిశీలించుకొని తత్పరిష్కారానికి సరియైన పథకం తయారుచేసుకోగలుగుతాడు. భారతదేశంలో వివిధ విషయాలకు సంబంధించి లెక్కలు తయారుచేసే ఆచారం క్రీస్తుపూర్వ 4 వ శతాబ్దంనుంచి వున్నది. సూర్యవంశపురాజుల కాలంలో సేకరించబడిన లెక్కలు, ఆప్టే ఆచరణలో పెట్టబడలేదు. ఆధునిక యుగంలో ఆర్థిక సాంఘిక విషయాల లెక్కలను తయారుచేసే విధానమునకు ఎక్కువప్రాధాన్యంవున్నది."

ఇక్కడి యీ సమావేశంలో పాల్గొన్న ప్రతినిధులు తమతమ ప్రభుత్వాలు రాజకీయ విధానాలను తయారు చేసుకొనుటలో తోడ్పడుతూ, ఆ విధానాలు ప్రజాసామాన్యానికి ఎక్కువ లాభదాయకంగా ఉండేటట్లు చూడాలి" అని జయరాందాస్ దౌలత్‌రాం ఉద్బోధించారు.

సమితి ఆహార వ్యవసాయసంఘ ఆర్థిక వ్యవహారాల డైరక్టర్ డా॥ హావర్డ్ టాల్లీ మాట్లాడుతూ, యీ శిక్షణ కేంద్రాన్ని నెలకొల్పడంలో ఉద్దేశ్యం, ఆగ్నేయ ఆశియాదేశాల ప్రభుత్వాలు జనాభాకు, తదితర విషయాలకు సంబంధించిన లెక్కలను తయారుచేసుకొనుటలో తోడ్పడుటే నని అన్నాడు.

## రేషను ధాన్యాలు తూకములో సప్లయి

చెన్నపట్నం, నవంబరు 1: రేషను అంగళ్ళలో ఆహారధాన్యాలు యిప్పటి కొలత ప్రమాణంలో గాక తూకములో సప్లయిచేసే పద్ధతిని ప్రభుత్వమువారు పరిశీలనారము అవలంబింప నిశ్చయించి యున్నారు. ఈ పరిశీలన టి. యం. సి. యస్. అంగళ్ళలో మాత్రమే ప్రస్తుతము అమలు జరుగును.

## జమీందార్లకు నష్టపరిహారం

మదరాసు, నవంబరు 1: బొబ్బిలి రాజా, వెంకటగిరి రాజాగార్లు ఇవ్వాళ ఉదయం మదరాసు ప్రధాని శ్రీ కుమారస్వామి రాజాగారిని వారి బసలో కలుసుకొనిరి.

కాంగ్రెసు అధ్యక్షుడు డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు, ఆర్థికమంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు, రివిన్యూమంత్రి శ్రీ సీతారామరెడ్డిగార్లు కూడ ఆ సమయమున అక్కడ వుండిరి.

జమీందార్లకు వెంటనే పరిహారమిచ్చుటనుగురించి, జమీందారీ రద్దుచట్ట సవరణబిల్లు గురించి చర్చించినట్లు తెలియుచున్నది.

# రు 650 లక్షల తపతీ నది ప్రాజెక్టుకు శంకుస్థాపన

## సర్దార్ పటేల్ సందేశం: గుజరాత్‌కు క్షామ ప్రమాదం పూర్తిగా తొలగిపోగలదని ఆశ

కాకద్వారా, (మండ్వి తాలూకా) నవంబరు 1: ఆరున్నర కోట్లు ఖర్చుపెట్టి కట్టించదలచిన తపతీనది ఇరిగేషన్ ప్రాజెక్టుకు బొంబాయి ప్రభుత్వ పబ్లిక్‌వర్క్సు శాఖామంత్రి డా॥ జీవరాజ మెహతాగారు ఈవేళ శంకుస్థాపన చేసిరి.

నదికి అడ్డంగా 2400 అడుగుల పొడవు 45 అడుగుల ఎత్తుగల ఆనకట్ట నిర్మించబడును. ఈ ఆనకట్టువద్ద ఇద్దరిన అద్దరిన రెండు కాల్వలుతవ్వి వీటిగుండా పరిసర భూములకు సాగుసౌకర్యాలు కల్పించబడును. ఈ ప్రాజెక్టు క్రింద మొత్తం 8,62,500 ఎకరాల విస్తీర్ణంగల భూమికి నీరు పంపకం చేయడానికి వీలవుతుంది తపతీనది ఇరిగేషన్ ప్రాజెక్టు శంకుస్థాపనోత్సవ సందర్భంలో ఉపప్రధాన మంత్రి సర్దార్ వల్లభాయ్ పటేలు ఈ సందేశం పంపెను:

కాక్రపర ప్రాజెక్టు(అనగా తపతీనది ఇరిగేషన్ప్రాజెక్టు, స్వతహాగా పెద్ద ప్రాజెక్టు అవడమేగాకనర్మద-తపతి బహుళ ప్రయోజన ప్రాజెక్టు మొదలైన అనేక బృహత్తరమైన ఇతర పథకాలకు దారి ఏర్పరచిన దవుతుంది. ఈ ప్రాజెక్టుల వలన గుజరాతేగాక పొరుగు రాష్ట్రాలలోని ప్రాంతాలుకూడా పచ్చబడి సౌఖ్య సౌభాగ్యాలతో సుభిక్షంగా మనడానికి అవకాశం ఏర్పడుతుంది. వ్యవసాయ భూములు వర్షాధారంగా ఉండడం ఎంత ప్రమాదకరమో, గుజరాట్‌లో కడచిన సారివచ్చిన క్షామం మనకు బాగా తెలివిడి తెచ్చింది. ఈ ప్రాజెక్టు ఎంత త్వరగా నిర్మాణమైతే అంతమంచిది. 8 ఏళ్ళలో ఈపని పూర్తికాగలదని అంచనా వేయబడినది. గుజరాట్ రైతులు ఈ ప్రాజెక్టుకింద లభించే నీటిపారుదల సౌకర్యాలను సమ్యగ్గంగా వినియోగించుకొని ప్రతిఒక్క నీటిబొట్టును పొల్లుపోనివ్వకుండా ఉపయోగంలోకి తెచ్చుకోగలరని ఆశిస్తున్నాను: ఆయకట్టుకిందకు వచ్చే ప్రతిఅంగుళం మేరను శ్రద్ధగా సాగుచేసి, బంగారం పండించాలి.

ఒక్క నీటిబొట్టునైనా పొల్లుపోనివ్వడం కాని దుబారా చేయడంగానిమహాపాతకం. మానవుని యోగక్షేమాల్ని అభివృద్ధికి ఉపయోగపడవలసిన ప్రకృతి సంపదలను సద్వినియోగ పరుచుకోవాలి.

గుజరాట్ నేను చెప్పినప్రకారం, కృషి చేసినట్లయితే, దేశంలో ఏర్పడ్డ ఆహార కొరతను చాలవరకు తీర్చినదవుతుంది.

ఈ ప్రాజెక్టుకు వేసే పునాది దృఢంగా కలకాలం నిలువగలిగేదిగా ఉంటుందనీ, యావద్భారతదేశ సౌభాగ్యానికి ఈప్రాజెక్టు సాధనభూతంకాగలదనీ ఆశిస్తున్నాను" వర్క్సు శాఖామంత్రి ఎన్. వి. గడ్గిల్, బొంబాయి ప్రధాని బి. జి. ఖేర్ ప్రభృతులు కూడా శుభాశంసన సందేశాలు పంపిరి.

బొంబాయి పబ్లిక్ వర్క్సు శాఖామంత్రి డా॥ జీవరాజ్ మెహతా ప్రాజెక్టుకు శంకుస్థాపనచేస్తూ ఈ విధంగా ఉపన్యసించిరి: "ఈప్రాజెక్టు మూలంగా 1,50900 టన్నులఆహారధాన్యం, 16 వేల టన్నుల పొడుగు పింజపత్తి పండగలదని అంచనా వేయబడినది. ప్రాజెక్టునిర్మాణం త్వరత్వరగా నిరంతరాయంగా జరిగిపోతుంది ఆనకట్టకట్టే ప్రాంతం దుర్గమం కాదు. కాబట్టిన్నీ, కావలసిన వస్తుసామగ్రి అంతా అందుబాటులోనేఉన్నది కాబట్టిన్నీ ఈపని చాలా సుకరంగా నిర్వహించవచ్చును." బొంబాయి ప్రభుత్వం సాగుసౌకర్యాల ప్రాజెక్టులకు ప్రథమ ప్రాధాన్యం ఇవ్వనిశ్చయించిందనీ, ప్రథమ పంచవర్ష ప్రణాళికలో 17 పథకాలు చేర్చబడినవనీ, వీటిలో 5 పథకాలను ఇదివరకే ప్రారంభించడమైనదనీ మెహతాగారు చెప్పిరి.

## నెహ్రూ హెచ్చరిక

(1-వ పేజీ తరువాయి)

గుర్తించబడాలి. భయభ్రాంతులు చంపుకోవాలి.

"ఒక వ్యక్తియొక్కగాని, ఒక జాతియొక్కగాని సంస్కృతి కొంచెం మనకు భిన్నంగా వున్నంతమాత్రంచేత వారిని కేవలం శత్రువుల క్రింద పరిగణించటం అవివేకం. శాస్త్ర విజ్ఞానాభివృద్ధి, సాంకేతిక విజ్ఞానాభివృద్ధి ఈనాడు ప్రపంచంలోని సర్వప్రాంతాలనూ సన్నిహితపరచి, ప్రపంచ సమైక్యతకు దారితీసెనై, ఈ సమైక్యతను పెంపొందనివ్వాలేగాని ఎక్కడికక్కడ కుంపటి కుదుళ్లుగా దిగ్గంధాలు నిర్మించి ఒకరి స్థితిగతులు మరొకరికి తెలియనీయకుండా కూపస్థ మండూకాలుగా తయారుచేయటానికి ప్రయత్నించటం క్రూరం.

"భారతదేశంలో పూర్వమూ ఇప్పుడూ కూడా విభిన్నజాతుల ప్రజలు, నివసించుతున్నారు. భారతీయ సంస్కృతి భిన్నభిన్న సంస్కృతుల మహాసమ్మేళనం. కాని యీనాడు భారతదేశంలో, ప్రాచీనాగునాటున సంస్కృతుల నడుమ కొంత సాగరమథనం జరుగుతున్నది.

'స్వాతంత్ర్య లబ్ధితో, శానిసత్వదినాల్లో స్తబ్ధంగా అణగిపడివున్న అనేక మహోజ్వలశక్తులు ఇప్పుడు భారతదేశంలో ఒక్కుమ్మడి రప్పుమని రగుల్కొని ప్రజ్వరిల్లుచున్నయ్. ఈతేజో రేఖలన్నీ ఆసియా మహోదయంలోని అంతర్భాగమే. ఆసియాలో ఇంకా పలు ప్రాంతాలు, విదేశాధిపత్యంనుంచి బయటపడటానికి తీవ్రంగా పోరాటాన్ని సాగించుతున్నయ్. ఆసియా సమస్యలను పరిష్కరించ దలచినవారు, మానవ సౌహార్దతను ప్రదర్శించటం అత్యవసరం.

ఎదిరిపక్షం సమానబలంలో కనుపించుతున్నప్పుడు తెలివిగల సెనాని యెవ్వడూ ముఖాముఖ తలపడడు. అప్రత్యక్ష ప్రతిఘటన విధానాలను ఆలోచించుతాడు. లేకపోతే వ్యర్థపోరాటమూ, కష్టనష్టాలు కలుగుతవి. అలాగే ఇతర జాతులనుగాని వ్యక్తులనుగాని, వారివారి మానసిక పరివర్తనానికి అనువైన అప్రత్యక్ష విధానాలనవలంబించి స్వాధీనంచేసుకోవటం తెలివితేటలనిపించుకుంటుంది గాని, మొండిపోరాటానికి పూనుకోవటంవల్ల ప్రయోజనముండదు. పైగా అలాంటి ప్రతిఘటన వ్యవహారమంతా బెడిసికొట్టటానికి కారణమౌతుంది" అన్నారు.

ఈప్రసంగం విని అవిందులో పాల్గొన్న 500 మంది ప్రముఖులు ఎంతో సంతోషించారు.

## నగరంలో చక్కెర పంపిణీ

### ప్రభుత్వ ఏర్పాట్లు

మదరాసు, నవంబరు 2: మదరాసు ప్రభుత్వము నవంబరు 13 నుండి ఈ క్రింది రీతిని పంచదారను పంపిణీ చేయవలెనని ఉత్తర్వు చేసెను.

ఆదాయముతో సంబంధము లేకుండా రేషను కార్డు వున్న వారికి తలకు నెలకు 8 ఫలములు లేక వారమునకు 2 ఫలముల పంచదార అందరికీ సమానముగా ఇచ్చెదరు. పిల్లలకు కూడ పెద్ద వారికివలెనే పంచదార ఇచ్చెదరు.

రు 100 లు మించి ఆదాయము గల వారి కుటుంబములకు మనిషి 1 కి నెలకు 12 ఫలములు గాని లేక వారమునకు 3 ఫలములు గాని అదనముగా ఇచ్చెదరు. ఈ ఏర్పాటు మదరాసు నగరములో మాత్రము వర్తించును.

కుటుంబ యజమాని ఆదాయమును తెలుసుకొనుటకు కార్డులున్న వారి నుండి డిక్లరేషన్ తీసుకొన దలచిరి. బియ్యపు రేషన్ కార్డులు నమోదు అయిన రేషన్ షాపులలో ఆదాయ వివరములు తీసుకొనెదరు. రేషనింగ్ ప్రాంతమును ప్రాంతములుగా విభజించిరి. నిర్ణయించబడిన రోజున ఆయా ప్రాంతములోని రేషను షాపులన్నిటిలోనూ ఆదాయ వివరములు తీసుకొనెదరు. ప్రతిరేషను దుకాణమువద్దను ఈ పనినిమిత్తం నిర్ణీత దినమున ఉదయం 7 నుండి 11 వరకు సాయంకాలం 7 వరకు రేషనింగ్ సిబ్బందిలో నొకరు హాజరున వుండెదరు, ఆదాయమును రూఢిపరచుటకు అచ్చువేయబడిన ఫారములు, ప్రతిరేషను దుకాణము నుండి పొందవచ్చును. పంచదార అదనపు కోటాకు అర్హులయిన కార్డుహోల్డరువారు ఉచితముగాఇచ్చు ఫారమును పూర్తి చేసి దుకాణమువద్ద హాజరువయున్న ఉద్యోగికి అందజేయవచ్చును. ఉద్యోగి బియ్యపు కార్డును తీసుకొని సంబంధించిన రేషనింగ్ ఆఫీసుకు తీసికొనివెళ్ళి అవసరము సమోజుచేసి రేషను దుకాణమునకు తిరిగి ఇచ్చివేయును. కార్డులుగలవారు 3 రోజున రేషను దుకాణమునుండి తీసుకొనవచ్చును.

ఆదాయములను రూఢిచేసుకొనుటకు ఈక్రిందికార్యక్రమమునిర్ణయించబడెను.

సర్కిల్సు 1-ఎ, 1-బి నవంబరు 3, సర్కిల్సు 2-ఎ, 2-బి నవంబరు 5, సర్కిల్సు 3-ఎ, 3-బి నవంబరు6, సర్కిల్సు 4,5 నవంబరు 7, సర్కిల్సు 6-ఎ 6-బి నవంబరు 8, సర్కిల్సు 7-ఎ 7-బి నవంబరు 9, సర్కిల్సు 8, 9 నవంబరు 10.

## ధరలం తగ్గించుట గూర్చి ముఖర్జీగారి సూచనలు

### మదరాసు మంత్రితో చర్చించుట

మదరాసు, నవంబరు 2: డా॥ ఎస్. పి. ముఖర్జీగారు, ఇండియా ప్రభుత్వ పరిశ్రమల శాఖ మంత్రి మదరాసు మీదుగ బెంగుళూరు వెళ్లుచు, సాయంకాలం మీనంబాకం విమానాశ్రయం వద్ద మదరాసు మంత్రి పెరుమాళ్ స్వామిరెడ్డిగారితో అర్థగంటసేపు చర్చించిరి. చేనేత పరిశ్రమ, అగ్గిపెట్టె పరిశ్రమల గూర్చి ముఖ్యంగా ముచ్చటించిరి. తూర్పుగాళము పాకిస్థానులోనికి పోయినందున చేమగ్గాలవారు యితర ప్రదేశాలకు అనుకూలంగా నుండె వస్త్రాలు నేయాలనిరి. నేత వారికి నూలు చవుకధరలకిస్తున్నా నేత సరకు మిగిలిపోయి నేత వారికి కష్టంగా నుందని, ముఖర్జీ గారికి తెలియజేయబడెను. ప్రభుత్వంవారు వీలయినంత సహాయం చేయుదరనిరి. అగ్గిపెట్టెల పరిశ్రమ చాల ఆందోళన స్థితిలోనుందని, దాన్ని ఉద్ధరించుటకు తగు సూచనలను రాష్ట్రప్రభుత్వానికి చేసితిమనిరి.

పాకిస్థాను నుండి వచ్చిన కాందిశీకులు ఉత్తర హిందూస్థానమునందు కంబళ్లు లేక అవస్థపడుచున్నారు, మదరాసునుండి అవి పంపినచో వారు వాటినుండి వస్తువులుచేసి అమ్ముకుందురని, కంబళ్లు మదరాసునుండి పంపుమని రెడ్డిగారిని కోరిరి.

ముఖ్యమయిన ఆహార వస్తువులు, వస్త్రములు, బొగ్గు వగయిరా ధరలను తగ్గించి ఉత్పత్తి యెక్కువ చేయాలని ఇండియా ప్రభుత్వంవారు నిశ్చయించిరని తెలిపిరి.

ఇండియా అంతా ఒక్క ఆర్థిక సంస్థగానెంచి, రాష్ట్రాలన్నీ కలసికట్టుగా పనిచేయాలని ముఖర్జీ గారు సూచించిరి.

## పచ్చయ్యప్ప ఆంధ్రాభ్యుదయ వారోత్సవములు

చెన్నపట్నం, నవంబర్ 2: పచ్చయ్యప్ప ఆంధ్రాభ్యుదయ వారోత్సవము సందర్భమున నిన్న యీవాళ ఇంటర్ కాలీజియట్ ఏకాంకనాటకాల పోటీ జరిగినవి.

రేపు 3 తే సాయం 5 గం కవిసమ్మేళనం శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి అధ్యక్షతను జరుగును. శ్రీయుతులు తాపి ధర్మారావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి పిలకా గణపతిశాస్త్రి మున్నగువారు పాల్గొనెదరు. నవం 4 తే సాయం6 గం. కాలేజి విద్యార్థులు యస్. జి. ఓ. నాటకము ప్రదర్శింతురు.

(మొదటిరోజు కార్యక్రమం విడిగా ప్రకటింపబడినది)

## 'నెహ్రూ నివేదిక విషయం మాకు తెలియదు'

### ఫ్రెంచి విదేశాంగశాఖ ప్రకటన

పారిస్, నవంబర్ 1: ఈవేళ ఒక ఫ్రెంచి విదేశాంగ శాఖోద్యోగి మాట్లాడుతూ, పండిత జవహర్ లాల్ నెహ్రూ ఇండో-చైనా గురించి పంపిన నివేదిక విషయం అధికారరీత్యా తమ కేమీ తెలియదని అన్నాడు.

పండిట్ నెహ్రూ ఒక నివేదికలో వియత్నామ్ మీద ఫ్రాంసు బావ్‌డాయ్ ప్రభుత్వాన్ని బలవంతంగా విధిస్తున్నదని వ్రాశారని నిన్న తెలిసింది.

"మాకీ విషయం కేవలం పత్రికలవల్లనే తెలిసింది" అని ఈ విదేశ శాఖోద్యోగి అన్నాడు.

## భర్త నిర్దోషిత్వాన్ని చాటటానికి 'బతికి' వచ్చిన స్త్రీ

బొంబాయి, నవంబర్ 1: తనను హత్య చేసినట్లు మోపబడిన నేరానికి విచారించబడుతున్న తన భర్త నిర్దోషిత్వాన్ని స్థాపించటానికై ఒక స్త్రీ నేడు బొంబాయి నగర న్యాయస్థానానికి 'బతికి' వచ్చింది. తన భార్య కనిపించటంలేదని ఆమె భర్త వారం రోజుల కిందట పోలీసులకు రిపోర్టు చేశాడు. ఆమె తండ్రి ఒక మృతశరీరాన్ని ఆమె శరీరమేనని 'గుర్తు పట్టా'డు. దానిమీద ఆమె భర్తనూ, మరిమువ్వురినీ పోలీసులు అరెస్టుచేసి హత్యా నేరం ఆరోపించారు.

ఈవేళ విచారణ జరుగుతుండగా ఆమె వచ్చి తనను భర్త హత్యచేయలేదని సాక్ష్యమిచ్చింది. నలుగురు విడుదలఅయినారు కాని ఆమె ఇంటినుంచి ఎందుకు పారిపోయిందో విచారించాలని తీర్పు చెప్పబడ్డది.

నిన్న ఇటువంటి సంఘటనే మరొకటి జరిగింది. మరొక వ్యక్తి తనభార్య ఇంటి దగ్గరనే కనపడినప్పుడు అక్కడి వెంట పోసులో పడివున్న ఒక స్త్రీ శరీరం తన భార్యదేఅని 'గుర్తు' పట్టాడు. కాని నగర పరిసర ప్రాంతంలో బంధువుల ఇంట్లో ఉండగా పోలీసులు అతని భార్యను కనిపెట్టారు.



అక్టోబరు 20 వ తేదీన న్యూయార్కులోని వాల్డార్ఫ్-అస్టోరియా హోటల్‌లో విదేశీ వ్యాపార దేశీయ సంఘంచేసిన విందు అనంతరం పండిట్ నెహ్రూ విశ్వవిఖ్యాత తత్వవేత్త డాక్టర్ జాన్ డ్యూవేను హోటల్ కమెజోర్‌లో కలుసుకున్నారు. ఆ రోజున డ్యూవే 90 వ జన్మదినోత్సవం సందర్భంలో అక్కడ ఒకవిందు జరిగింది. జాన్ డ్యూవేతో పండిట్ నెహ్రూ సంభాషిస్తున్న దృశ్యం.



ఫిలిప్ మెక్‌కార్మిక్, హార్వెస్టర్ కంపెనీ అధ్యక్షునితో 'ఫార్మాల్ క్లబ్' ట్రాక్టర్లను పరిశీలిస్తున్న ప్రధాని పండిట్ నెహ్రూ.

## గోపాలస్వామి అయ్యంగారితో పణిక్కర్ సంప్రతింపులు

### కమ్యూనిస్టు చైనాను గుర్తించే సూచన

న్యూఢిల్లీ, నవంబర్ 1: చైనాలో భారతరాయబారిగా ఉంటున్న సర్దార్ కె. ఎమ్. పణిక్కర్ ఈనాడిక్కడ ఢిల్లీకివచ్చి భారతప్రభుత్వానికి చైనా పరిస్థితులు తెలియజేశారు. అప్పుడాయన ప్రస్తుతం విదేశీ వ్యవహారాలు పరిశీలిస్తున్న గోపాలస్వామి అయ్యంగారితో దీర్ఘమైన చర్చ జరిపారు.

తరవాత సర్దార్ పణిక్కర్ సర్దార్ పటేలును కలుసుకొని వారితో కూడా సంప్రతించారు. అనంతరం ఆయన గవర్నర్ జనరల్‌ను కూడా సందర్శించారు.

పండిత నెహ్రూ అమెరికా నుంచి తిరిగి రాగానే భారత ప్రభుత్వం కమ్యూనిస్టు చైనాను గుర్తించిన విషయం ప్రకటించ బడగలదని తెలుస్తున్నది.

## రోములో హెచ్చరిక

(1-వ పేజి తరువాయి)

ఆసియాలో జాతీయ స్వాతంత్ర్యోద్యమం ఉప్పెనవలె విజృంభించినది. గమ్యస్థానం చేరకుండా దాని నెవ్వరూ నిరోధించలేరు.

ప్రస్తుతం ఆసియాలో తక్షణం చేయవలసినపని ఆకలిబాధను తొలగించటం. కాని చేయవలసిన అసలుపని ఆ ప్రాంత ఆర్థిక జీవితాన్ని సంపూర్ణంగా మార్చివేయటమే. వ్యవసాయంలో క్రొత్త పద్ధతులను ప్రవేశపెట్టటం, క్రొత్త పరిశ్రమలను నెలకొల్పటం, వాణిజ్యాన్ని అభివృద్ధి చేయటం, ఈ ప్రాంతదేశాల ఆర్థికాభివృద్ధి నంతా సమన్వయించి ఒక పథకం ప్రకారం అభివృద్ధిని సాధించటం అనే కర్తవ్యాలను నిర్వహించవలసి ఉన్నది. చేయవలసినపని చాలా పెద్దది. చాలా జటిలమైనది. ఎక్కడనుంచీ మొదలుపెట్టాలో కూడా సరిగా తెలియదు. కాని వెనకపడ్డదేశాలకు సాంకేతిక సహాయం చేయుట మన్నదానిలో పనికొంత మొదలైనదని చెప్పాలి.

ఐక్యరాజ్యసమితిలోని దేశాలన్నీ పరస్పర విశ్వాసంతో సహకరించగలరని ఋజువుచేయటానికి సమితి కార్యక్రమాలన్నిటిలోకీ ఈ కార్యక్రమ విజయమే ఎక్కువ ముఖ్యం. ఆసియా ఆర్థికాభివృద్ధి అంటే కేవలం వ్యవసాయాభివృద్ధేకాని పారిశ్రామికాభివృద్ధికి స్థానం లేదని కొందరు భావిస్తున్నారు. అది వారికి దూరదృష్టిలోపించినట్లు ఋజువుచేస్తుంది. వ్యవసాయాభివృద్ధివల్ల కలిగిన మేళ్లను అనుభవించే ఆసియా ప్రజలు పారిశ్రామికాభివృద్ధివల్ల కూడా వచ్చే మేళ్ళను వదులుకోరు." అని ఆయన వివరించారు.

## కొత్త రకం రైలు పెట్టె

### బెంగుళూరులో డా॥ ముఖర్జీ పరిశీలన

బెంగుళూరు, నవంబరు 1: క్రొత్తరకపు రైల్వేపెట్టె క్రొత్త నమూనాను నేడు భారత ప్రభుత్వ పారిశ్రామికశాఖ సభ్యుడు డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీ గారు తనిఖీ చేసిరి. 70 అడుగుల నిడుపు 10 అడుగుల వెడల్పు గల ఈ ఉక్కు పెట్టెను హిందూస్థాన్ ఎయిర్‌క్రాఫ్టు కంపెనీవారు నిర్మించిరి. ఇదివరలో భారత రైల్వేలకుగాను నిర్మింపబడిన పెట్టెల నమూనా కంటె ఈ నమూనా పెట్టె దాదాపు 3 టన్నులు బరువు తక్కువ. రైల్వే అధికారుల పరీక్షకొరకుగాను ఈ పెట్టెను ఢిల్లీ పంపెదరు. ఈ ఫ్యాక్టరీవారు నెలకు 12 పెట్టెలు నిర్మింపగలిగియున్నారు. బొంబాయి ప్రభుత్వము వారికిగాను ఈ ఫ్యాక్టరీవారు సెడన్ డయిసిల్ ఛాసిస్ నమూనాపై నిర్మించిన మొదటిబస్సు ఆవరణయందుగూడ పరిశ్రమశాఖమంత్రి తనిఖీ చేసెను. ఇందుకు కావలసిన భాగములన్నియు ఇంగ్లండునుండి వచ్చినప్పటికి త్వరలో ఈ భాగములన్నిటిని కంపెనీవారే స్వయముగా తయారుచేసికొనగలుగుదురు.

## సమితికి ఆజాద్ కాశ్మీర రాయబార వర్గము

కరాచీ అక్టోబరు 31: ఆజాద్ కాశ్మీరు పక్షమున ఐక్యరాజ్య సమితికి విజ్ఞప్తి గావించుటకు ఒక రాయబారవర్గము రేపు బయలుదేరి లండన్ మీదుగా న్యూయార్కు వెళ్లుచున్నది. ఈ రాయబార వర్గమునకు ఆజాద్ కాశ్మీర్ ప్రభుత్వ అధ్యక్షుడు సర్దార్ ఇబ్రహీం నాయకుడు. కాశ్మీర్ వ్యవహారముల శాఖ మంత్రి ఆ ఫ్తబ్ అహమ్మద్ ఖాన్, ఆతని భార్య, కరాచీ సివిల్, మిలిటరీ గజెట్టు ఉద్యోగి ఇస్లామ్, కాజల్‌గారలు రాయబార వర్గములో సభ్యులు. ఇస్లామ్‌గారు రాయబార వర్గ ప్రచార శాఖాధికారిగా నుందురు.







సమితి ధర్మకర్తృత్వశాఖ డైరెక్టరు, పాలస్తీనాలో సమితి మధ్యవర్తిగా పనిచేసిన విక్టర్ రాల్ఫ్‌బంచ్‌ని అక్టోబరు 19 న వాల్డార్ఫ్ అస్టోరియాహోటల్‌లో జరిగిన విందులో పండిట్ నెహ్రూ కలుసుకున్నారు.



అక్టోబర్ 24 వ తేదీన భారత ప్రధానమంత్రి కెనడా శాసనసభల సమావేశంలో ఉపన్యసించారు. (ఈ చిత్రం నిన్ననే ప్రకటించబడింది.) ఉపన్యాసానంతరం సభాభవనంనుండి పండిట్ నెహ్రూ కెనడా ప్రధాని సెంట్ లారెంట్‌తో బయటికి వచ్చివేస్తున్న దృశ్యం.

## మిగులుప్రాంతాల్లో రేషనింగ్ రద్దు

### మంత్రిమండలితో ఆహారధాన్య పరిశీలకసంఘ సంప్రతింపు

మదరాసు, నవంబరు 2: ఆహార ధాన్య పరిశీలన సంఘ అధ్యక్షుడు మైత్రా, ఇతర సభ్యులు దక్షిణాది కేంద్రముల పరిశీలన ముగించుకొని నిన్న సాయంత్రము ప్రభుత్వ కార్యాలయములో ఆహార ధాన్యముల ధరలు, మిగులు ప్రాంతములలో రేషనింగ్ రద్దుచేయుట మొదలగు విషయములను మదరాసుమంత్రిమండలితో చర్చించిరి.

మిగులు ప్రాంతములలో రేషనింగ్ రద్దుచేసి రేషనింగ్‌ను పట్టణములకు పారిశ్రామిక కేంద్రములకు మాత్రము పరిమితమొనర్చుట గురించి ప్రభుత్వాభిప్రాయము కోరిరి. ఈ చర్యవలన ఆహార ధాన్యములు యధాపూర్వము ఒక చోట నుండి మరొక చోటుకు కదిలి చీకటి బజారు నశించుననియు, అదీగాక ప్రభుత్వమునకు సేకరణ వ్యయము తగ్గుననియు తలచుచున్నారు. ఇందువలన రేషన్ ప్రమాణమును హెచ్చు చేయుటకు వీలయి దొంగ వర్తకమును తద్వారా నశింప చేయవీలగునని కూడ అభిప్రాయం వెల్లడించిరి.

ఆహార ధాన్యములపై విక్రయముల పన్ను వసూలు గురించిన చర్చలో ఆహార ధాన్యములపై విక్రయపు పన్ను వసూలుచేయుట సబబు కాదనియు, ఇందువలన ఇండియా ప్రభుత్వమూ, రాష్ట్రప్రభుత్వమూ గ్రాహకులకు సబ్సిడీగా ఇచ్చుచున్న ప్రయోజనం శూన్యము చేయబడుచున్నదని స్పష్టపరచిరి.

తరువాత పరిపాలనకు సంబంధించిన ఖర్చుతగ్గించుట, ఆహార ధాన్యములను తూకమునుండి, కొలతలోనికి మార్చుటగురించి చర్చించిరి.

1950 నుండి బియ్యం దిగుమతులను తగ్గించుటకు ఇండియా ప్రభుత్వము నిర్ణయించి నందున గోధుమ వినియోగమును దక్షిణాదిన హెచ్చు చేయుటకు ప్రచారము చేయవలసిన అవసరమును గూర్చి కమిటీ వారు సూచించిరి.

ప్రస్తుతపు ఉత్పత్తి, రేషనింగ్ ప్రమాణములను బట్టి రాష్ట్రములోలోటు చెప్పుకోతగినంతగా లేదనియు, మొత్తము మీాద పరిస్థితి నిరాశా జనకముగా లేదని కమిటీ వారు అభిప్రాయపడినట్లు తెలియుచున్నది.

ఈ విషయములన్నిటినీ సమగ్రముగా పరిశీలించి అభిప్రాయ మివ్వవలసినదని కమిటీ వారు ప్రభుత్వమును కోరినట్లు తెలియుచున్నది.

ఆర్థిక మంత్రి శ్రీ గోపాల రెడ్డిగారు సమావేశము అనంతరం విలేఖరులతో మాట్లాడుచు ఆహార ధాన్యములమీాద విక్రయపు పన్నును ఎత్తివేసిన రాష్ట్ర ఆర్థిక స్థితిలో మార్పు రాగలదని అనిరి. ఒక్క ఆహార ధాన్యముల మీాదనే విక్రయముల పన్ను ద్వారా రాష్ట్ర ప్రభుత్వమునకు రు 4 కోట్లు ఆదాయము వచ్చుచున్నది. ప్రస్తుత క్లిష్ట సమయములో ఇంత మొత్తమును పోగొట్టుకొన జాలమని అన్నారు.

కమిటీ సభ్యులు 3 వ తేదీన విమానములో కలకత్తా వెళ్లెదరు.

## నెహ్రూకు శాన్ ఫ్రాన్సిస్కో పౌరసత్వం

### ఆశ్చర్య బహూకరణ

శాన్ ఫ్రాన్సిస్కో, నవంబర్ 2: శాన్ ఫ్రాన్సిస్కో మేయరు, పౌరుల సన్మాన సంఘము కలిసి నిన్నరాత్రి భారత ప్రధాని పండిత నెహ్రూకి ఒక విందునుచేసి శాన్ ఫ్రాన్సిస్కో నగర పౌరసత్వాన్ని లాంఛన ప్రాయంగా బహూకరించారు. ఈ అంశాన్ని వెల్లడిస్తూ లిఖించిన ఒక పత్రాన్ని ఈ సందర్భంలో వారాయనకు బహూకరించారు. ఈ విషయం ముందుగా తెలియక పోవటంవల్ల దీనికి పండిత నెహ్రూ ఆశ్చర్యంలో మునిగిపోయినారు. పౌరసత్వ బహూకరణ చివరివరకూ అతిరహస్యంగా ఉంచబడినది.

ఇంతవరకూ ఏ అతిథికీ ఈ గౌరవం ఇచ్చినట్లు తనకు స్మృతిలేదని నగరప్రముఖుడొకాయన తరవాత వెల్లడించాడు.

## కమ్యూనిస్టుల దురాగతం

జగ్గయ్యపేట, నవంబరు 1: లింగగిరి పరగణా ప్రముఖ కాంగ్రెసువాది యారుముక్కల పెదగోపయ్యగారు మొన్నరాత్రి వారి భవనం సమీపంలో కమ్యూనిస్టులచే కాల్చి చంపబడినారని లింగగిరి పరగణా కాంగ్రెసు సంఘంవారు తెలియజేస్తున్నారు. ఈ సందర్భంలోనే దోపిడీలు కూడ జరిగినవి. పరగణా ప్రజలందరు భీతావహులైయున్నారు.

## గురుపుపదవి గవర్నర్ జనరల్ పదవికంటె ఉత్కృష్టమైనది

### గాడిచెర్ల హరిసర్వోత్తమ రావుగారి ప్రసంగం

హిందూపురం, అక్టోబర్ 31 : మొన్న ఉదయం వయోజన విద్యా శిక్షణాలయ ప్రారంభోత్సవ సందర్భమున అధ్యక్షత వహించిన గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారు ఉపన్యసిస్తూ తాను సుఖ రహితు డైనప్పటికిని, తనవద్దకు వచ్చువారలలో అజ్ఞానాంధకారమును నశింపజేసి వారి హృదయాలలో జ్ఞానదీపికను వెలిగింపజేయు గురుపుపదవి గవర్నరు జనరలు పదవికంటెను ఉత్కృష్టమైనది. అని అన్నారు. అనంతపురం జిల్లా కలెక్టరు సి. వివేకానందమూర్తిగారు శిక్షణాలయమును ప్రారంభించిరి.

ప్రార్థనానంతరం శిక్షణాలయ తెలుగు శాఖ ప్రధానోపాధ్యాయులు ప్రకాశరావు గారు ఆంధ్రదేశంలో వందేమాతరం ఉద్యమ కాలంనుండి వయోజన విద్యా ప్రచారోద్యమమును వివరిస్తూ ఎక్కువ ఫలితములు లేకపోయినప్పటికిని గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారున్నూ, ఆంధ్రదేశ గ్రంథాలయమువారును దీనినిసరించి అనవరతమూ కృషి చేయుచునే వచ్చుచుండినరని చెప్పిరి. యు. పి. సి. పి. లలో వయోజన విద్యాబోధనోద్యమము పొందిన సత్ఫలితములను గుర్తించి 1948 ఏప్రిలు నెలలో మదరాసు ప్రభుత్వమువారు దీని నమలుపరచుటకై తీవ్రముగా ఆలోచనచేసి, పంచవిధ ప్రణాళికను జూన్‌మాసమున జారీచేసిరి. దీనిలో రెండుమాత్రము ప్రారంభింపబడినవి. వీటి ప్రకారం వయోజనులలోని నిరక్షరాస్యతను నిర్మూలించుటానికై అనుసరించదగు విధానములలో శిక్షణనొసంగు శిక్షణాలయములు ప్రారంభింపబడినవి. ఈ శిక్షణాలయములలో శిక్షణపొందినపిదప, శిక్షితులు ప్రభుత్వ గ్రాంటుసహాయంతో పాఠశాలలను ప్రారంభింపవలసియుందురు. ఇటువంటి పాఠశాలలలో నాలుగునెలల కాలపరిమితి గలఒక కోర్సున్ను, మూడుసంవత్సరముల కాలపరిమితిగల మరియొకకోర్సున్ను గలవు. అయితే ప్రకృతం నాలుగు మాసములకాల పరిమితిగల్గ కోర్సు బోధింపబడుచున్నది. ప్రయోగముల వల్ల ఈ నాలుగు మాసముల కోర్సునుండి సరియైన ఫలితములు గాన్పించినవి. ఆంధ్రదేశంలో ఇప్పటివరకు ఏడు వయోజన విద్యాశిక్షణాలయములు ఉపాధ్యాయులను శిక్షితులుచేయుటకై నెలకొల్పబడిపని చేయుచున్నవి. వీటిలో ఇంతవరకు 250 మందిశిక్షణపొందారు. ఇప్పుడిక్కడ ప్రారంభింపబడుచున్న ఈ శిక్షణాలయము ఆంధ్రలో ఎనిమిదవది. ప్రజల సహకారము పైననే ఈ సంస్థయొక్క విజయము ఆధారపడి యున్నదని వివరిస్తూ ప్రకాశరావు గారు ప్రజల సానుభూతి సహకారముల నర్థించారు.

తరువాత శిక్షణాలయ కన్నడశాఖ ప్రధానోపాధ్యాయులు లక్ష్మీనారాయణ రావుగారు ప్రసంగించారు.

జిల్లాకలెక్టరు శ్రీ వివేకానందమూర్తి గారు వయోజన విద్యయొక్క విలువ, దాని ప్రాముఖ్యతను గురించి సదీర్ఘముగ వివరించి, దేశంలోని ప్రతిస్త్రీయును, పురుషుడును తప్పక మంచి పౌరులను, సనార్థులను, దుర్మార్గులను పరిగణించుటకు కావలసినంత మాత్రమైనను చదువను వ్రాయను నేర్చుకొనుట యత్యవసరమని పలికిరి.

ఈ శిక్షణాలయము ప్రజల, ప్రభుత్వ సహాయ సహకారములతో ఎక్కువ ప్రయోజనకారిగా నుండునని విశ్వసించుచున్నామనిరి.

గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు మాట్లాడుచూ హిందూపురంలో ఈ శిక్షణాలయము నెలకొల్పుటయందు అత్యంత శ్రద్ధాసక్తులను గనపరచిన జిల్లాకలెక్టరు సి. వివేకానందమూర్తిగారిని అభినందించిరి. ప్రభుత్వము ఇటువంటి సంస్థలకు ఎక్కువగా సహాయపడగలదని తలంచకూడదనుచూ, ఈ కార్యక్రమమునకు కోట్లకొలది ధనము కావలసియుండునని, దీనిని ప్రోగుచేయవలసిన ప్రభుత్వము, ప్రజలను మరింత పన్నలువేసి బాధింపవలసియుండునని, చెప్పిరి. కాబట్టి ఇందులో శిక్షణను పొందుచున్న విద్యార్థులు స్వార్థదృష్టితో గాక ప్రజలలోని అవిద్యను నిర్మూలించుటకై, ప్రభుత్వ సహాయ మెరుగుచూడక, కృషిచేయవలసియున్నదనిరి. గురుపదవి మహోత్కృష్టమైనది. దీనికున్న గౌరవము, ప్రతిష్ఠ, కీర్తి మనసులో నుంచుకొని గురువులనువారు తమ కర్తవ్యనిర్వ్యము నిర్వహించితే ప్రజల సానుభూతి తప్పక పొందగలరు అనిరి. ప్రజలు సర్వవిధ సహకారము నియ్యవలయునని కోరిరి. శిక్షణాలయ సహోపాధ్యాయులగు సుబ్బారావుగారి వందన సమర్పణతో సభ సమాప్తమయ్యెను. స్వ. వి.

## భక్తురాలికి భగవంతుని చక్రాంకితం

### భద్రాచలరాముని భక్తపరాధీనత!

(స్వకీయ విలేఖరి)

భద్రాచలం. అక్టోబరు 27 : శ్రీమతి ఎస్. పద్మాబాయి ట్రిచేంద్రం కాపురస్తురాలు, ప్రస్తుతం ఆమె, పశ్చిమ గోదావరి జిల్లా నులకపల్లిలోని ఐ. ఎల్. టి. డి. కంపెనీలో సమాస్తాగా వుంటున్న తన అల్లుడు వి. వి. సీతారామారావు ఇంట వుంటున్నది. శ్రీరామ భక్తురాలు.

15 రోజులక్రితం రాములవారు ఆమెకు కలలో కన్పించి తన దర్శనార్థం ఆమె భద్రాచలం రావలెననీ, లక్షసార్లు శ్రీరామ నామ జపం చేయవలెననీ, తిరుపతి వేంకటేశ్వరస్వామికి ఆమె మొక్కుకున్న మొక్కుబడిని తానే స్వీకరించుననీ, తానే రంకన్న, వెంకన్నే తాను అనీ, ఆ మొక్కు ప్రసాదించెదననీ, మొక్కుబడి ముట్టినట్లు ఒక చిహ్నము వేసెదననీ చెప్పి అంతర్థానమయారట.

అప్పటినుంచీ ఆమె అహోరాత్రాలు శ్రీరామనామ స్మరణలో నిమగ్నమయ్యెనట.

దరిమిలా ఒక రోజున రాములవారు ఆమెను పూని, మొక్కుబడిని మూడు భాగాలుచేసి, ఒక వంతు తన కిమ్మనీ, ఒక వంతు తిరుపతి పంపమనీ, మూడో వంతు దాన ధర్మాలు చేయమనీ సెలవిచ్చారట.

లక్షనామజపం అయిన తర్వాత, క్రిందట గురువారం ఆమె, కూతురు, అల్లుడు ఇక్కడికి వచ్చి స్థానిక ఐ. ఎల్. టి. డి. మేనేజరు పి. వి. కృష్ణయ్యగారింట బస చేశారు. ఆరోజు సాయంకాలం ఆమె ఆలయానికి పోయి దైవదర్శనం చేసుకొంటూండగా, శ్రీరామునిలీలకన్పించి క్షేత్రోపవాసం చేయమని చెప్పెనట. ఆ ప్రకారం ఆమె ఆ రాత్రి ఉపవాసం ఉండెను. రాత్రి సుమారు ఒంటిగంట వేళప్పుడు ఆమె కుడి చేతిమీద ఏదో కుట్టినట్లనిపించి చూసుకోగా చక్రాంకితం కనిపించినదట. వెంటనే పలువురు ఆ చక్రాన్ని చూశారు.

ఆ చక్రం చూడడానికి వందలాది ప్రజ వస్తున్నారు. భగవంతుడు తనకు మూడు మాసాలలో ముక్తి కలిగిస్తానని చెప్పాడని ఆమె అన్నది.

## ప్రసూతి చికిత్సాలయం

మదరాసు, నవంబరు 1 : మదరాసు ప్రభుత్వ ప్రసూతి చికిత్సాలయము నందు ఎగ్మూరులో క్రొత్త బ్లాకు భవనముల శంకు స్థాపనోత్సవము గవర్నరు సతి నిన్న సాయంకాలం జరిపెను. గవర్నరు గారు వ్యవసాయ శాఖ మంత్రి ఎ. బి. షెట్టి గారు, నౌకాదళాధిపతి అడ్మిరలు పారీ గారు, సర్జను జనరలు మున్నగు పెద్దలు సభకు వచ్చిరి. మదరు అందు బేబీ వీకు కమిటీ అధ్యక్షురాలు కట్టువాలా సతిగారు తాము రూ 62,000 చందాలు వసూలు చేసిరి మనియు. క్రొత్త వార్డు 48 మంచాలకు సరిపోవునట్లు కట్టదలచితి మనియు చెప్పిరి.

జాగా చాలక ఆస్పత్రి నుండి పురుడయిన రెండో రోజో మూడో రోజో నే పురిటాళ్లను పంపి వేయు చున్నారు. కనుక యిట్టి వార్డులు ఎక్కువగ కట్టించుట అవసరమని, గవర్నరు సతి భవనగరు మహారాణి నుడివెను.

డా॥ టి. ఎస్. ఎస్. రాజను గారు, ఆరోగ్య శాఖా మంత్రి వందనములర్పిచుచు, గ్రామాలందు యిట్టి వసతులు ఎక్కువ చేయుటకు స్త్రీల సంఘాలు తోడ్పడ వలెనని సూచించిరి.

## నూలు ధరలు

నవంబరు 1 వ తేదీ తరువాత తయారయిన నూలుకి ఫాక్టరీసరకు 12½ కు మించి వ్యాపారస్థులు ఎవ్వరు అమ్మకుండా తగు యేర్పాటులు చేయాలని జిల్లా కలెక్టరులకు మదరాసు ప్రభుత్వం వారు ఉత్తరువులు చేసిరి.

### రక్షణశాఖ సిబ్బందికికూడా చేనేత బట్టలు

చెన్నపట్నం, అక్టోబరు 31 : ఇండియా ప్రభుత్వమువారు తమ శాఖల సిబ్బందికిని మిలిటరీవారి అవసరాలకు కూడా చేనేత బట్టలుకొని సప్లయి చేయుటకు అవకాశములను కనుగొనుచున్నారు. దేశంలో చేనేత పరిశ్రమకు ప్రోత్సాహ మొసగుటమే దీని ఉద్దేశ్యము. ఇందుకుగాను బొంబాయి పద్ధతిలో కనబడు చేనేత వస్త్రముల రకాల ధరలను పంపవలసినదిగా మదరాసు ప్రభుత్వమును కోరినట్లు తెలుస్తున్నది.

### సారాయిబుడ్లు పట్టుబడుట

చెన్నపట్నం, నవంబరు 1 : అబ్లాపిన్నసేఠులోని నోకయింటియందు మస్తాన్ రెడ్డి (40) అను వాడు 4 సారాయిబుడ్లను ఉంచుకొని యుండినందుకు పోలీసులు నిన్న అరెస్టు చేసిరి.

## పచ్చయ్యప్ప కళాశాల ఆంధ్రసాహిత్య సమితి

### ఆంధ్రాభ్యుదయ వారం: రాజమన్నార్ ప్రారంభోత్సవం

చెన్నపట్నం, నవంబరు 1 : మదరాసు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి. వి. రాజమన్నార్‌గారు నిన్న సాయంత్రం పచ్చయ్యప్ప కళాశాల ఆంధ్ర సాహిత్యసమితి ఆంధ్రాభ్యుదయ వార ప్రారంభోత్సవమును కళాశాలా హాలులో జరిపిరి. సమితి విద్యార్థి అధ్యక్షురాలు మిస్ వై. సరోజినిశ్రీ ప్రధాన న్యాయమూర్తి, సభాసదులకు స్వాగతమొసగిరి.

శ్రీ రాజమన్నార్ గారు ఆంధ్రాభ్యుదయ వారోత్సవమును ప్రారంభిస్తూ దేశముయొక్క ప్రాచీన సంస్కృతిని విజ్ఞానము కళలు పునరుద్ధరించి వైభవమును కాపాడుటకు యిట్టి విజ్ఞానవారోత్సవములు తోడ్పడగలవనిరి. అదియునుగాక యీ ఉత్సవాలు నిధిసహాయార్థము జరుపుటకు మరింత సంతోషదాయకమగుననిరి. తెలుగు వాఙ్మయము మహోన్నతమైనది. త్యాగయ్యవారి కీర్తనల ప్రాశస్త్యము అమరావతి శిల్పకళా విశిష్టత మెచ్చుకొని ఉత్సాహపడినంత మాత్రం చాలవనియు అట్టికళల వైభవము శాశ్వతము మనునట్లు ఆంధ్రులైన ప్రతివారు ప్రయత్నించుట అవసరమనియు యిట్టి విజ్ఞాన వారోత్సవములు అందుకు దోహద మివ్వగలవనియు చెప్పిరి.

తెలుగు వాఙ్మయము కళలు సంస్కృతిలోగల గొప్పను బాగా ప్రచారము చేయుటకు సర్వసాహిత్యపు గ్రంథములను హిందీ ఇంగ్లీషు భాషలలో తర్జుమాలు చేయవచ్చునని కోరిరి.

అప్పటిని శ్రీరజనీకాంతరావు, శ్రీమతి కమలాదేవి శ్రీ కే. రఘురామయ్యగారి సంగీత ప్రదర్శనము జరిగెను.

శ్రీ ఆర్. కృష్ణమూర్తిగారు పిన్నిపాలు వందనార్పణముతో కార్యక్రమము ముగిసెనది.

### రేపటి కార్యక్రమం

పచ్చయ్యప్ప కాలేజి ఆంధ్రవిజ్ఞాన వారోత్సవము సందర్భమున రేపు 2 వ తేదీ సాయంత్రం 6 గం. ఇంటర్ కాలేజి యేట్ ఏకాంక నాటకం పోటీజరుగును.

## చెన్నపట్నం సమస్య

### డాక్టర్ పట్టాభిగారి పరిష్కార సూచన.

మదరాసు, నవంబరు 1: "మదరాసు నగరము ద్విభాషా ప్రాంతముగాదు. బహుభాషాప్రాంతమైన నగరమునూ, పరిసర ద్విభాషాప్రాంతములను చేర్చి ఒక ప్రత్యేక రాష్ట్రముగా ఏర్పరచిన భాషారాష్ట్రముల మధ్య ఐక్యతచేకూర్చుటకు తోడ్పడగలదు" అని కాంగ్రెసు అధ్యక్షుడు డా॥ పట్టాభి సీతారామయ్యగారు పచ్చయ్యప్ప కళాశాలలో జరిగిన సభలో విద్యార్థుల ప్రశ్నలకు సమాధానమిచ్చుచు మదరాసు నగరము భవిష్యత్ గురించి పునరుద్ఘాటించిరి.

విద్యార్థి పైర్కొను శ్రీ రామస్వామి డాక్టరుగారికి స్వాగతమిచ్చుచూ గాంధీజీ సిద్ధాంతములనుండి గాడితప్పి మతసంస్థలకు స్థానమిచ్చినందుకు కాంగ్రెసును తీవ్రముగా విమర్శించిరి.

సమాధానమిచ్చుచూ కాంగ్రెస్సుతీర్మానములలో రాష్ట్రీయ స్వయంసేవక సంఘముపై ఎప్పుడూ నిషేధము లేదు. అందువలన నిషేధముతొలగించు ప్రశ్నేయే లేదనిరి. ముస్లింలీగు, హిందూమహాసభ అకాలీ పంత్ వారికి మాత్రము కార్యవర్గములలో ఉండరాదని నిరాకరించబడినది. అయినా వారుకూడ ప్రాథమిక సభ్యులు గా చేరవచ్చును అని డాక్టరు అనిరి.

ద్రవిడస్తాన్ ఉద్యమము ఇతర భాషా రాష్ట్రములవలెనే అయిన అర్థం తరము ఉండదని మరొక ప్రశ్నకు డాక్టరు గారు జవాబు ఇచ్చిరి.

## మద్యనిషేధ ప్రచారం

### 442 ప్రచారకులను నియమించుటకు ప్రభుత్వ నిర్ణయం

మదరాసు, నవంబరు 1 : తాలూకాకు ఇద్దరు చొప్పున రాష్ట్రమంతటా 442 మద్యనిషేధప్రచారకులను నియమించుటకు ప్రభుత్వము మంజూరు చేసెను. ఈ వుద్యోగము నిమిత్తం చాల దరఖాస్తులు వచ్చియున్నందున వానిని పరిశీలించుటకు ప్రభుత్వము ఆంధ్ర ప్రాంతమునకు ఒక కమిటీని, ఆంధ్రేతర ప్రాంతములకు ఒక కమిటీని నియమించెను.

మొదటి కమిటీలో డా॥ ఎం. రంగయ్య, శ్రీ పిడతల రంగారెడ్డి, గిద్దలూరు, శ్రీ కె. వరాహనరసరాజు సభ్యులుగా నియమించబడిరి. ఈ కమిటీకి డా॥ రంగయ్య గారు అధ్యక్షులుగా వుందురు.

## పిల్లుల పాడవు కంట్రోలు

### రాష్ట్రమునకు కేంద్రప్రభుత్వ వుత్తర్వు

మదరాసు, నవంబరు 1 : చిత్రముల పొడవు 11,500 అడుగులకుమించి వుండ కూడదనే వుత్తర్వును నిక్కచ్చిగా అమలు జరుపవలెనని ఇండియా ప్రభుత్వము మదరాసు ప్రభుత్వమునకు వ్రాసినట్లు తెలియుచున్నది.

దక్షిణాదిజనము అభిరుచినిబట్టి చిత్రములపొడవు 15,000 వేల అడుగులవరకు వుండవలెనని మదరాసు ప్రభుత్వం తన అభిప్రాయమును లోగడనే తెలిపియున్నది.

మదరాసుప్రభుత్వం ఇండియా ప్రభుత్వమువారి తాజాలేఖమీద ఇంకా ఎట్టి నిర్ణయము చేయలేదని కూడ తెలియుచున్నది.

### "రాంబాణ్" చిత్రంపై నిషేధం

మదరాసు, నవంబరు 1: "రాంబాణ్" అనే చలనచిత్రముపైగల నిషేధమును ఎత్తివేయవలెనని ఫిలింస్ నిర్మాతలు కొందరు న్యాయ, విద్యామంత్రి శ్రీ మాధవమీనన్ ను నేడు కలుసుకొని విన్నవించిరి. ఈ చిత్రము బొంబాయి, ప్రకాశ్ పిక్చర్సు వారు తయారుచేసిరి.

రాయబారములో మోహన్ పిక్చర్సు సొసైటీ అధ్యక్షుడు శ్రీ చునీలాల్, జమ్‌షెడ్ నాడియా, మైసూరు ఫిలింఛేంబర్ అధ్యక్షుడు భటియా, 'రాంబాణ్' చిత్ర నిర్మాత, దర్శకుడు విజయభట్, కె. సుబ్రహ్మణ్యం, శ్రీ సుందరం వుండిరి. "సీతను" ఈ చిత్రములో ప్రజలలో ఆమెయెడల భక్తిని తగ్గించినట్లు చిత్రించినారనే కారణమున ప్రదర్శనార్హముగాదని నిషేధించియుండిరి.

ఈ చిత్రము దేశములో మరెచటను నిషేధించబడలేదనియు, మదరాసు ప్రభుత్వముమాత్రము ఈ చిత్రమును "ఫిలిం ఇండియా" విమర్శలనుచూచి చర్య తీసుకొన్నదనియు, ఇది అన్యాయమని విన్నవించిరి.

న్యాయ, విద్యామంత్రి శ్రీ మాధవమీనన్ తాను స్వయంగా చిత్రమును చూచి ఈ విషయమును పరిశీలించెదనని చెప్పిరి. ఈనెల 4 వ తేదీ సాయంత్రము 8-30 గం॥ లకు చిత్రమును చూచుటకు ప్రధాని, హోంశాఖ కార్యదర్శి విద్యామంత్రి అంగీకరించిరి.

రాయబారము ప్రధానినికూడ కలుసుకొని వారి వాదనను విన్నవించుకొనిరి.

